

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః

# సాంప్రదాయిక వ్యాస మాలిక- 29



పుండరీకాక్ష పెరుమాళ్, తిరువెళ్ళఱై




'పండితరత్న'
డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అழగ శింగరాచార్యులు

# విషయసూచిక

శ్రీమతే రామానుజాయ నమః

# తిరువెళ్ళరై దివ్య దేశ వైభవమ్

ఈ దివ్యదేశాన్ని తిరువెళ్లరై, ఆదితిరువెళ్లరై, లేదా, శ్రీశ్వేత గిరి అని పిలుస్తారు. ఈ దివ్య దేశానికి ఆది అనే పదం. ఉపసర్గ. అది, దాని ప్రాచీనతను సూచిస్తుంది. తిరు అనే పదం దాని ఉన్నత స్థితిని, గొప్పతనాన్ని సూచిస్తుంది. వెళ్ళరై, మరియు, శ్వేత గిరి అనేవి ఇక్కడి కొండకు సంబంధించిన పేర్లు. ఇది తెల్లటి గ్రానైట్ శిలలతో కూడినది. ఈ దేవాలయం, శ్రీరంగం కంటే ముందు ఉండేదని, పురాణాల ప్రకారం ఇది చాలా పురాతనమైనదని పరిగణించబడుతున్నది. ఈ దివ్య దేశం తిరుచ్చి–– తురైయూర్ రహదారిలో శ్రీరంగానికి ఉత్తరాన 15 కిలోమీటర్ల దూరంలో ఉంది.

## శిబిచక్రవర్తికి ఈ క్షేత్రంతో కల సంబంధం

శిబి చక్రవర్తి శ్రీరామచంద్రునకు పూర్వీకుడు. అతడు రావణుడిని యుద్ధంలో ఎదుర్కోవడానికి, అతనికి గుణపాఠం చెప్పడానికి లంకకు వెళుతున్నప్పుడు, దారిలో తన సైన్యంతో శ్వేతగిరిలో కొంతకాలం గడిపాడు. అపుడు, ఇక్కడ, అతడు తెల్లటి పందిని (వరాహం) చూశాడు. ఆ కొండపై ఉండే తెల్లటి రాతి పలకల సందులలో అదృశ్యమయ్యే వరకు దానిని అతడు వెంబడించాడు. ఇంత వేగంగా ఆ అడవి పంది అదృశ్యమైనందుకు ఆ చక్రవర్తి ఆశ్చర్యపోయాడు. అతడు, అక్కడకి. సమీపంలో మార్కండేయుడు తపస్సు చేయడం చూశాడు. అతడు ఆ ఋషికి నమస్కరించాడు. అప్పుడు, ఆ ముని శిబిని అక్కడకు సమీపంలోని తెల్లటి పుట్టకు తిరుమంజనం (అభిషేకం) చేయవలసిందిగా సూచించాడు. ఆ చక్రవర్తి మహర్షి సూచనలను పాటించి, భగవంతుని దర్శించే భాగ్యాన్ని పొందాడు.

శిబి, అక్కడ చీమల పుట్ట ఉండే ప్రదేశంలో భగవంతుని కోసం ఒక ఆలయాన్ని నిర్మించాడు. అక్కడ, గంగ యమునా నదుల మధ్య నివాసాలను కలిగి ఉన్న 3, 700 పూర్వ శిఖా శ్రీ వైష్ణవులను అక్కడకు రప్పించి, వారిని శిబి స్థిరపరిచాడు. వారిలో ఒక శ్రీవైష్ణవుడు, అక్కడ స్థిరపడిన వెంటనే

మరణించాడు. ఆ వైష్ణవుని అకాల మరణంతో శిబి చక్రవర్తి చాలా బాధపడ్డాడు. దుఃఖంలో ఉన్న శిబికి భగవంతుడు ప్రత్యక్షమై, మరణించిన వైష్ణవుని స్థానంలో తాను తిరువెళ్ళరైలో నిలుస్తానంటూ ఓదార్చాడు. శిబి, ఆవిధఇ-గావెలసిన భగవంతుని ఆరాధన కోసం ఐదు తటాకాలను తవ్వించాడు: అవి–

1. వరాహ,
2. పద్మ,
3. మణికర్ణిక,
4. కుచస్తి, మరియు
5. గంధ పుష్కరిణీ తీర్థాలు.

సంతానం లేనివారు కార్తీకమాసంలో ఆదివారంనాడు ఈ తీర్థాలలో స్నానం చేసి, భగవంతుని దర్శనం చేసుకుని, సంతానం పొందడం ఇక్కడి సంప్రదాయం.

ఇక్కడ, స్వస్తిక ఆకారంలో ఉన్న " మామియార్ మనాట్టు పెన్న తీర్థం" అని పిలువబడే మరొక తీర్థం కూడాఉంది. ఇక్కడ అత్తగారు, కోడలు ఒకరికొకరు కనుచూపు మేరలో పడకుండా ఒకేసారి స్నానాలు చేసే విధంగా ఈ పుష్కరిణి ఆకారం ఉన్నది.

పెరియాళ్వార్ ఈ పూర్వశిఖా శ్రీవైష్ణవుల వంశీయులే. వారిలో కొందరు, తిరుక్కోట్టియూర్‌కు కూడా వెళ్లారు. శిబి చక్రవర్తిద్వారా శ్రీశ్వేతగిరిలో స్థిరపడిన ఈ పూర్వశిఖా శ్రీవైష్ణవుల వారసులలో పెరియాళ్వార్ యొక్క ఆచార్యులు శెల్వ నంబి కూడా ఒకరు.

తిరువెళ్ళరై లోని గాలి ఔషధ గుణాలతో ప్రసిద్ధి చెందింది. ఈ గాలి, ఇక్కడి అనేక నందనవనాలలోని మూలికల, పూల పొదల సువాసనతో కూడి ఉంటుంది. స్వామి దేశికులు తమ హంస సందేశ కావ్యంలోని 40వ శ్లోకంలో, ఈ విధంగా క్షేత్రంలోని నందనవనాన్ని స్తుతించారు.

**స్నిగ్ధచ్ఛాయం తదను లలితం తస్య ధామేవ నీలం**
**నీలిరక్షా నియత లలితం కాననం సంవిశేయాః |**
**దృష్టేః తస్మిన్ అనిమిషవధూః నిత్య నిర్వేశయోగేః**
**స్వర్గోద్యాన శ్రియ మపి లఘుం మన్యతే మానసం తే ||**

ఓ నా మిత్రమా! నీవు తిరువెళ్ళుక్కైలోని స్వామికి పూజలు చేసిన తర్వాత, (శ్లోకం 39) , దయచేసి ఈ దివ్య దేశం యొక్క అందమైన నందనవనాన్ని చూడకుండా ఉండకు. ఆ తోట, ఎప్పటికీ పచ్చగా ఉండే వృక్షాల వల్ల చల్లని నీడను కలిగి ఉంటుంది. ఇది, ఈ దివ్య దేశంలోని స్వామివారి రంగుతో ఉంటుంది. నీలి అనే రాక్షసి దానిని ఎప్పుడూ రక్షిస్తుంది. అది, దానిని సురక్షితంగా, అందంగా ఉంచుతోంది. ఈ నందనవనం ఇంద్రుని నందనవనం కంటే చాలా అందంగా ఉంటుందని దేవకాంతలు భావిస్తారు, అందువల్ల వారు తిరువెళ్ళుక్కై క్షేత్రంవద్ద ఉండే ఈ నందనవనానికి తరచుగా వస్తారు. ఈ నందనవనాన్ని, నీవు కిందకు దిగకుండానే, పై నుండే చూస్తే సరిపోతుంది. ఈ నందనవనం ఇంద్రుని దివ్యోద్యానవనాల కంటే చాలా అందమైనదని నీవుకూడా అంచనా చేస్తావు. ఇంద్రుని నందనవనాన్ని. పెద్దగా పట్టించుకోనవసరం లేదని దృఢంగా నిశ్చయించుకుంటావు.

స్వామి దేశికులు ఈ క్షేత్రంలోని, అద్వితీయమైన సువాసనగల వాయువుయొక్క వైభవం గురించి తదుపరి శ్లోకంలోనూ కొనసాగించారు. మొత్తం మీద స్వామి దేశికులు తిరువెళ్ళుక్కై క్షేత్రానికి నాలుగు శ్లోకాలను అంకితం చేశారు. వారు, తిరువెళ్ళుక్కై, శ్రీరంగం, తిరువేంగడం, కంచి, తిరుమాలిరుమ్ శోలైలలోని మూర్తులను తిరువెళ్ళుక్కైతో పాటు ఇతర అర్చామూర్తులను తన హంససందేశంలో స్తుతించారు. ఈ స్థలంలోని అర్చామూర్తి విషయంలో దేశికులకు ఉన్న గౌరవం అంత గొప్పది.

**తిరువెళ్లక్కై క్షేత్రంలోని ఆచార్య వైభవమ్**

హంసను ఉద్దేశించి పలుకుతూ శ్రీరాముడు, దక్షిణ దిశలో అది ప్రయాణిస్తున్నప్పుడు, తిరువేంకటాచలం, కాంచీపురం, మీదుగా వెళ్ళాలని, ఆపై, అది చోళదేశంలోకి ప్రవేశించాలని దానికి సూచించాడు. కంచి (సత్యవ్రత క్షేత్రం) హంసను దర్శించమని చెప్పిన మొదటి దివ్య దేశం. తరువాత తిరువెళ్ళక్కై. దాని తర్వాత శ్రీరంగం, తిరుమాలిరుమ్ శోలై ఉన్నాయి.

హంస సందేశ కావ్యంలో దేశికులు, రామచంద్రుడు పలికినట్లుగా, హంసతో పలుకుతూ, చోళ దేశం సరిహద్దులు దాటుతుండగా, పవిత్రమైన ఈ శ్వేత గిరి నీటిలో మునిగిపోయిన కైలాస పర్వతం వలె, తెల్లని రంగు కలిగిన ఆదిశేషుడు తలపైకెత్తినట్లుగా కనిపిస్తుందని ("మగ్నకైలాసదృశ్యం శ్వేతం శైలం ఫణిపతిమివ ద్రక్ష్యసి") అన్నారు.

తరువాత, స్వామి దేశికులు, రామచంద్రుని మాటలతో, తిరువెళ్ళక్కైలోని స్వామిని ఈ విధంగా పూజించడం వల్ల కలిగే ప్రయోజనాలను మనకు వివరిస్తారు.

**స్ఫారాలోక ప్రశమితతమః సంచయం తత్ర పుంసాం**
**ప్రత్యగ్రూపం ప్రగుణ విభవం ప్రార్థనీయం బుధానామ్,**
**నేదీయాంసం కుశలనివహం నంతురాధాస్యతే తే**
**దివ్యం తేజో జలధితనయా స్నేహనిత్యానుషక్తమ్.**

శ్వేతాద్రిలో నిత్య నివాసం చేసే పుండరీకాక్ష స్వామిని ఇందులో దేశికులు వర్ణిస్తున్నారు. ఆ క్షేత్రంలో ఉండే పుండరీకాక్షుడనే వస్తువు దివ్యమైన తేజస్సును కలిగినది. పాల సముద్రంలో ఆవిర్భవించిన లక్ష్మీదేవితో ఎల్లప్పుడూ స్నేహంతో కలిసి ఉండేది. మిక్కిలి కటాక్షం కారణంగా సమస్త తమస్సును పోగొట్టేది. కైవల్యం, ఐశ్వర్యం, మోక్షం వంటి సమస్త పురుషార్థాలను

ఇవ్వగలిగినది. చాలా గొప్ప ఐశ్వర్యాలను తన అధీనంలో కలిగినది. సమస్తాన్ని విడచిన జ్ఞానుల చేత ప్రార్థింపబడేది. దానిని నీవు నమస్కరిస్తే, అది నీ సమస్తమైన హితాన్ని త్వరగా అభివృద్ధి అయ్యేటట్లు చేయగలిగినది.

ఎంతోమంది పూర్వాచార్యులకు ఈ క్షేత్రంతో అవినాభావ సంబంధం ఉన్నది. మన పూర్వాచార్యులలో ఆద్యులైన శ్రీమన్నాథమునుల ప్రధాన శిష్యులలో ఒకరైన ఉయ్యక్కొండార్ ఈ దివ్యదేశంలోనే అవతరించారు. వారి పేరు కూడా ఈ దివ్యదేశంలోని అర్చామూర్తి నామమైన పుండరీ కాక్షులు అనే నామమే. వారు, తమ ఆచార్యులైన నాథమునులు ద్వారా తమకు బోధించిన నాలాయిర దివ్య ప్రబంధసందేశాన్ని లోకంలో అందరికి ప్రచారం చేసినందున, ఉయ్యక్కొండార్ అనే పేరును పొందారు.

తమకు శ్రీరంగంలో విషం పెట్టి చంపడానికి ప్రయత్నించిన దురదృష్టకర సంఘటన తర్వాత, శ్రీరామానుజులు ఇక్కడ కొన్ని నెలలు గడిపారు. వారు ఇక్కడ ఉన్న సమయంలో ఉపయోగించిన పుష్కరిణిని నేటికీ "ఉడైయవర్ కుళం" అని పిలుస్తారు.

ఇక్కడ ఉండే స్వామి, తన దేవేరికి సమర్పించిన పొంగల్ ప్రసాదాన్ని స్వీకరించమని రామానుజులను ఆదేశించాడు. అందువల్ల, నేటికీ, తాయార్‌కు సమర్పించే పొంగల్ ప్రసాదాన్ని నాదస్వరంతో, మేళంతో పాటు సమస్తోపచార గౌరవాలతో తీసుకువస్తారు.

రామానుజుల సమకాలీనుడైన ఎంగళాళ్వాన్ కూడా తిరువెళ్లఱైలో అవతరించినవారే. వారి పేరు విష్ణుచిత్తులు. వారు కూరేశుల వలె గొప్ప ప్రతిభావంతులు. కాబట్టి, రామానుజులు వారిని "ఎంగళ్ ఆళ్వాన్" అని ముద్దుగా పిలిచేవారు. ఒకసారి, కంచికి చెందిన నడాదూర్ ఆళ్వాన్ తన మనుమడు, నడాదూర్ అమ్మాళ్ ను తిరువెళ్లఱై దివ్య దేశానికి వెళ్లి, అక్కడ వేంచేసి ఉన్న ఎంగళాళ్వాన్ సన్నిధిలో భగవద్రామానుజులు అనుగ్రహించ

శ్రీభాష్య మహా గ్రంథంలోని రహస్యార్థాలను గ్రహించమని పంపించారు. అమ్మాళ్ కూడా ఆ విధంగానే శ్వేతాద్రి దివ్య క్షేత్రానికి వెళ్లి, సాయంసమయంలో ఆళ్వాన్ ఇంటి తలుపులు తట్టారు. అళ్వాన్ ఇంటి లోపల నుండి "ఎవరు వచ్చారు? " అని అడిగారు. అప్పుడు అమ్మాళ్ " నేను వచ్చాను" అని సమాధానం చెప్పారు. వెంటనే ఆళ్వాన్ "నేను చనిపోయిన తరువాత తిరిగిరా" అనే సమాధానం చెప్పారు. ఈ మాటలు అమ్మిళ్ కు అర్థం కాలేదు. వారు కంచికి తిరిగి వెళ్ళిపోయారు. జరిగిన సంగతిని తమ తాతగారికి చెప్పారు. "నేను చనిపోయిన తరువాత తిరిగి రా "అని ఆళ్వాన్ పలికిన సమాధానానికి తాత్పర్యం ఏమో తమకు తెలియలేదని అన్నారు. అప్పుడు అమ్మాళ్ తాతగారు, ఆ సమాధానంలోని తాత్పర్యాన్ని తెలియజేస్తూ, " నీలో ఉండే అహంకారం తొలగిపోయిన తరువాత తిరిగి రమ్మని వారు నీతో అన్నారు. అందువల్ల, నీవు మళ్ళీ వారి దగ్గరకు వెళ్లి, "దాసుడను వచ్చాను" అని సమాధానం చెప్పు. అప్పుడు వారు నిన్ను అనుగ్రహిస్తారు" అని అన్నారు. అమ్మాళ్ కూడా ఆ విధంగానే చేయగా, అళ్వాన్ వారిని అనుగ్రహించి, తమకు శిష్యులుగా చేసికొని, శ్రీభాష్యంలోని రహస్యార్థాలను అన్నిటినీ బోధించారు. ఈ కారణం వల్లనే ఆళ్వాన్ వంశీయులకు–" అమ్మాళ్ ఆచార్యులు" అనే బిరుదనామం స్థిరపడింది. ఈనాటికి ఈ వంశంవారు శ్వేతాద్రి దివ్య క్షేత్ర ప్రాంతంలో నివసిస్తున్నారు.

## దివ్యసూరుల మంగళాశాసనం

ఆళ్వారులలో పెరియాళ్వార్లు, తిరుమంగై ఆళ్వారులు – అనే ఇద్దరు ఆళ్వారులు ఈ దివ్యదేశాన్ని, ఇక్కడ నెలకొని ఉండే స్వామిని అనుభవించి, కీర్తించారు. వీరు కీర్తించిన పాశురాలు మొత్తం 24 ఉన్నాయి.

పెరియాళ్వారులు తమ ప్రబంధంలో 11 పాశురాలలో ఈ దివ్యదేశాన్ని, ఇక్కడి స్వామిని మంగళాశాసనం చేశారు. వీటిలో పది పాశురాలు "కాప్పిడల్" అని ప్రసిద్ధి చెందిన దశకంలోనివి. మిగిలిన ఒక పాశురం, శ్రీ కృష్ణ బాలకుడు చేసే శెంగీరై అనే నృత్యాన్ని గూర్చిన ఆళ్వారుల అనుభవాన్ని తెలిపే దశకంలోనిది.

తిరుమంగై అళ్వార్లు అనుగ్రహించిన 13 పాశురాలలో, 10 పాశురాలు ఐదవ శతకం మూడవ దశకంలోనివి. వేరొక పాశురం 10 వ శతకం రెండవ దశకంలోనిది. మిగిలిన రెండు, మడల్ ప్రబంధాలలోనివి. ఐదవ శతకంలోని మూడవ శతకంలో గల పాశురాలలో తిరుమంగై ఆళ్వార్లు శ్వేతాద్రిలోని భగవానుని పరశురామావతారునిగా, హయగ్రీవునిగా, నరసింహునిగా, శ్రీకృష్ణునిగా, ఆదివరాహమూర్తిగా, రామునిగా, హంసావతారునిగా వామనునిగా భావించి కీర్తించారు. ఈ విధంగా వర్ణించడం, అవతార మూర్తులకు, అర్చామూర్తులకు మధ్య గల ధర్మైక్యాన్ని బట్టి. ఈ దశకంలోని పాశురాలు అన్నీ శ్వేతాద్రి వైభవానికి సంబంధించిన, అక్కడ నెలకొనే ఉండే స్వామికి సంబంధించిన వైభవాన్ని తెలియజేసే అందమైన వర్ణ చిత్రాలు. సహృదయ హృదయ రంజకాలు.

## శ్వేతాద్రిలోని ఆలయ సన్నివేశం

ఇక్కడ ఐదు ప్రాకారాలు ఉన్నాయి. మొదటి ప్రవేశ ద్వారం వద్ద పుండరీకాక్షుడు మనకు అందించిన గీతలోని 18 అధ్యాయాలను గుర్తుచేసే 18 మెట్లు ఉన్నాయి. ఈ 18 మెట్లు ఎక్కిన తర్వాత, 4 వేదాలకు సమానంగా పరిగణించబడే 4 మెట్లు వస్తాయి.

తరువాత, భక్తులు, తాము కోరిన కోరికలు నెరవేరాలని ప్రార్థించే బలిపీఠం. ఉన్నది. భక్తులు కోరిన కోర్కెలు తీరిన తర్వాత ఇక్కడ స్వామికి

తిరుమంజనం చేయిస్తారు. బలి పీఠం దాటిన తరువాత, పంచ భూతాలను సూచించే ఐదు మెట్లు ఉన్నాయి. ఐదు మెట్లు ఎక్కి, ఆ తరువాత గల వాకిలిని దాటిన తర్వాత, రెండు ద్వారాలు ఉంటాయి వీటి ద్వారా కొండను ఎక్కి, ఆలయగర్భగృహాన్ని చేరుకోవాలి. ఈ రెండు ద్వారాలలో, ఒక ద్వారం దక్షిణాయనంలోనూ, రెండవ ద్వారం ఉత్తరాయణంలోనూ తెరుస్తారు. కొండ ఎక్కిన తరువాత, 8 మెట్లు ఉంటాయి. ఈ ఎనిమిది మెట్లు అష్టాక్షరికి సంకేతాలు. ఆ తరువాత 24 మెట్లు ఉంటాయి. ఇవి గాయత్రీ మంత్రానికి సంకేతం. ఈ మెట్లను ఎక్కితే, మూలస్థానాన్ని చేరవచ్చు. ఇక్కడనే శెందామరై క్కణ్ణన్ (పుండరీకాక్షుడు) అనే అర్చామూర్తి, తన దివ్యపత్ని పంకజచ్చెల్వినాచ్చియార్ తో కలిసి, విమలాకృతి విమానం కింద నెలకొని ఉన్నాడు. ఈ స్వామి ప్రయోగ చక్రాన్ని ధరించి ఉన్నాడు. మనోహరమైన నాసికను, మిరుమిట్లు గొలుపే అందాన్ని కలిగిన నేత్రాలను, అందమైన నాలుగు బాహువులను, ఎటువంటివారినైనా మోహింప చేసే చిరునవ్వును కలిగి, తన వద్దకు వచ్చిన భక్తులను ఈ స్వామి స్వాగతిస్తూ, వారిని అనుగ్రహిస్తాడు. ఈ భగవానుని ప్రయోగ చక్రం భగవదనుభవ విరోధులను మటుమాయంచేస్తుంది.

ఈ ఆలయంలోని స్వామి తన సర్వాధికారాలను తన దివ్య పత్నికి ఇచ్చివేశాడు. ఉత్సవ సమయాలలో స్వామి కంటే తాయారు వేంచేస్తారు. స్వామి ఆమెను అనుసరిస్తాడు ఈ ఆలయానికి సంబంధించిన ఆస్తిపాస్తులు అన్నీ కూడా తాయార్ పేరుననే ఉన్నవి. ఇక్కడ తాయారుకు ప్రత్యేకమైన సన్నిధి లేదు.

ఈ ఆలయం గోడలలో రాతిశాసనాలు చాలా ఉన్నాయి. ఇవి అన్ని, ఈ ఆలయ వైభవాన్ని, ఈ ఆలయానికి పలువురు ప్రభువులు, ధనికులు, భక్తులు సమర్పించిన పలు కైంకర్య వివరాలను తెలుపుతున్నాయి.

దివ్యకవి పిళ్లై ప్పెరుమాళ్ అయ్యంగార్ అనే గొప్ప ద్రావిడ కవి 108 దివ్యదేశాల వైభవాన్ని, అక్కడ నెలకొని ఉండే భగవన్మూర్తుల వైభవాన్ని కీర్తిస్తూ, “నూற்றெట్టు త్తిరుపతి అందాది” అనే ఒక అందమైన ప్రబంధాన్ని రచించారు. అందులో, వారు, ఈ శ్వేతాద్రి క్షేత్రాన్ని, ఇక్కడ ఉండే స్వామిని కీర్తిస్తూ ఈ విధంగా అన్నారు.

**కల్లిరుందాన్ తందై కమలత్తోన్, అక్కమల**
**త్తిల్లిరుందాన్ తందై యరంగేశనెన్ఱే – తొల్లై మఱై**
**యుళ్ళఱైయా నిన్ఱమైయాల్ ఉళ్ళమే! కళ్ళమిన్ఱి**
**వెళ్ళఱైయాన్ తాళే విరుంబు.**

(ఓ మనసా! “కైలాస వాసి అయిన శివునకు తండ్రి బ్రహ్మ. ఆ బ్రహ్మకు తండ్రి శ్రీమన్నారాయణుడు” అని అనాది అయిన వేదాలలో చెప్పబడినందున, తిరువెళ్లఱై అనే దివ్యదేశంలో సేవను అనుగ్రహిస్తూ ఉండే ఆ శ్రీమన్నారాయణుని శ్రీపాదాలనే నీవు కోరుకో.)

నూజివీడు సంస్థాన ఆస్థాన విద్వాన్ శ్రీమాన్ కిడాంబి గోపాల కృష్ణమాచార్యస్వామి వారు తాము అనుగ్రహించిన దివ్యదేశ వైభవ ప్రకాశిక అనే గ్రంథంలో ఈ క్షేత్రాన్ని కీర్తిస్తూ ఈ శ్లోకాలను అనుగ్రహించారు.

**తీర్థైః పుష్కల పద్మ చక్ర కుశలైః సంశోభమానస్థితే**
**దివ్యే శ్రీమణికర్ణికాహ్వాయ వరాహాఖ్యాత తీర్థాంచితే,**
**గంధక్షీర సుదివ్య పుష్కరణికాయుక్తే సితాద్ర్యాహ్వాయే**
**రాజంతం నగరే తు వెళ్ళ రపదే ప్రాగాస్యసంస్థానగమ్.**

**శ్రీమచ్చంపకవల్లికాపరిగతం శ్రీపంకజ చ్చెల్వికా**
**నాయిక్యా విమదాకృతిం సురుచిరం వైమానపర్యశ్రితమ్.**
**మార్కండేయ శిబిక్షితీశ గరుడక్షోణీ దృశాం గోచరం**
**పద్మాక్షాహ్వాయ మాశ్రయే కలిరిపుశ్రీవిష్ణుచిత్తస్తుతమ్.**

**ఈ క్షేత్రంలోజరిగే ఉత్సవాలు ఇలా ఉన్నాయి.**

చిత్తిర మాసం – పూచ్చాత్తు ఉత్సవం
ఆడి మాసం– జేష్ఠాభిషేకం
ఆవణి మాసం – శ్రీజయంతి
పురట్టాసి మాసం– నవరాత్రి సమయంలో తాయారు ఉత్సవం
అల్పిసి మాసం –డోలోత్సవం
కార్తీక మాసం –దీపోత్సవం
తైమాసం– సంక్రాంతి, పారువేట ఉత్సవం
పంగుని మాసం –బ్రహ్మోత్సవం, రథోత్సవం.

**"నమస్తే పుండరీకాక్ష! నమస్తే పురుషోత్తమ!**
**నమస్తే పంకజా నాథ! నమస్తే లోకనాయక!"**

**ఆళ్వారుల శ్రీసూక్తులలో శ్వేతాద్రి, పుండరీకాక్ష వైభవాలు.**

పెరియాళ్వార్లు, తిరుమంగై ఆళ్వార్లు ఈ దివ్య దేశాన్ని ఇక్కడి స్వామిని కీర్తిస్తూ అనుగ్రహించిన పాశురాలను అనుసంధించినప్పుడు, ఎన్నో విశేషాలు మనకు గోచరిస్తాయి. అవి అన్నీ మనకు పరమ భోగ్యాలుగా దర్శనమిస్తాయి.

## పెరియాళ్వారుల సూక్తులలో తిరువెళ్లక్షై క్షేత్ర వైభవం

ఈ క్షేత్రంలోని ఆలయం ఆకారాలను చుట్టూ కలిగినది ఇక్కడ ఉండే భవనాలు చంద్రమండలన్నీ తాకే రీతిలోని ఎత్తును కలిగినవి. ఇక్కడ నివసించే మునులు మూడు సంధ్యా సమయాలలోనూ స్వామిని కీర్తిస్తారు. పరమ సాత్వికులైన పురుషులకు ఇది కాణాచి. రత్నాలు పొదిగిన మేడలతో, ప్రాకారాలతో ఈ క్షేత్రం పరివృతమై ఉన్నది. వేదార్థ విచారదులైన పెరియాళ్వార్లు నివసించిన క్షేత్రం, ఇది.

## పెరియాళ్వారుల సూక్తులలో పుండరీకాక్ష వైభవం

ఇంద్రుడు, బ్రహ్మ, శివుడు మొదలైన దేవతలు అందరూ మంత్ర పూతాలైన పూలను తమ చేతులతో తీసుకొని, వానిని స్వామికి సమర్పించడం కోసం సమయం కోసం వేచి ఉంటారు. శ్రీ కృష్ణావతారాన్ని ఎత్తి పలు దివ్య లీలలను చేసిన భగవానుడే ఇక్కడ పుండరీకాక్షుడుగా వెలిశాడు. ఇక్కడి స్వామి తేజఃపుంజాలతో గొప్పగా ప్రకాశిస్తున్నాడు.

## తిరుమంగై ఆళ్వారుల సూక్తులలో శ్వేతాద్రి వైభవం

ఈ ఆళ్వారుల సూక్తులలో శ్వేతాద్రి మనోహరంగా మనకు దర్శనమిస్తుంది. ఈ క్షేత్రంలో అంతట మామిడివృక్షాలు,, అడవి మల్లెలు, మల్లెలతో, మాధవీలతలు కూడిన ఉద్యానవనాలు నిండుగా ఉన్నాయి. వాటిపై ప్రసరిస్తూ వచ్చిన మలయ మారుతం సుగందాన్ని కలిగినదై ఈ దివ్యదేశంలో మనోహరంగా వీస్తూ ఉంటుంది. ఈ క్షేత్రం నీటి సమృద్ధిని నిండుగా కలిగినది ఇక్కడ ఉండే తటాకాలలో చేపల సమూహాలు ఆనందంగా తుళ్ళుతూ ఉంటాయి. తామర పువ్వులు బాగా పూచి, పరిమళిస్తూ, ఆ సరస్సులకు అందాన్ని కలిగిస్తాయి. ఇక్కడ ఉండే మామిడి తోటలలోని లేత చిగుళ్ళను

కోకిలలు తిని, అందువల్ల తమ నోరు చేదు కాగా, ఆ రుచి మారడం కోసం అక్కడ ఉండే పనస తోటలలోని పండ్ల నుండి స్రవించే తేనెను ఆస్వాదిస్తాయి. గొప్పగా పూచే అడవి మల్లెతీగలు చెరుకుగడలపై పాకి, చల్లని స్వచ్ఛమైన చిరునవ్వును చిందించే విధంగా అందంగా పూలను పూస్తాయి. ఇక్కడ ఉండే ఉద్యానవనాలలో ఆడు తుమ్మెదలతో ప్రణయ కలహం ఆడిన మగ తుమ్మెదలు అక్కడనుండి వెళ్ళిపోయి, ఈ క్షేత్రంలోని భవనాల పై భాగాలలో సంచరించే స్త్రీల కొప్పులలోకి చేరుతాయి. ఈ క్షేత్రంలో మరకతమనుల కాంతిని కలిగిన ఆకులను కల పూల నుండి చెందిన తేనెను తాగిన తుమ్మెదలు పరమ భోగ్యంగా గానాన్ని చేస్తాయి ఇక్కడ ఉండే మొగలి తోటలలో, మామిడి తోటలలో తుమ్మెదల గుంపులు ఆనందంగా సంచరిస్తూ, "తెనా తెనా" అని అంటూ ఇంపైన రాగాలను పాడుతాయి. ఇక్కడ ఎత్తుగా ఎదిగిన అశోక వృక్షాలపై ఉండే ఎర్రని పూల పైకి ఎక్కి తుమ్మెదలు, మామిడి వృక్షాలను ఎక్కి కోకిలలు మధురంగా ధ్వనిస్తాయి. ఈ క్షేత్రంలో మణులతో నిర్మింపబడిన భవనాలు నిండుగా ఉన్నాయి.

స్వాపదేశార్థంలో గమనిస్తే, ఇక్కడ ప్రస్తావింపబడిన కోకిలలు తుమ్మెదలు సదాచార్యులే. పలువురు పూర్వా ఆచార్యులు ఆదరించి అభిమానించి నివసించిన క్షేత్రం కదా, ఇది. ఇక్కడి కోకిలలు, తుమ్మెదలు పాడే పాటలు ఏమంటే, భగవంతుని గుణ కీర్తనాలను చేసే వైదిక సూక్తులు, దివ్య ప్రబంధ సూక్తులే. ఈ విధమైన భావనతో మనం ఈ క్షేత్రాన్ని దర్శించి తరించాలని ఈ దివ్య సూరులు ఇద్దరూ మనకు ఈ విధంగా ప్రబోధిస్తున్నారు.

## తిరుమంగై ఆళ్వారుల సూక్తులలో పుండరీకాక్ష వైభవం

పరశురామ హయగ్రీవ హంస వరాహ నృసింహ వామన శ్రీకృష్ణాది పలు అవతారాలను ఎత్తి, దుష్ట శిక్షణను, సాధు సంరక్షణను స్వామియే

ఇక్కడ పుండరీకాక్షుడు అనే దివ్య నామంతో అర్చామూర్తిగా వెలిశాడు. అందువల్ల ఈ స్వామిని సేవిస్తే, మన అవరోధాలు అన్ని తీరి, మన అభిమాతాలు సిద్ధిస్తాయి. ఇక్కడి స్వామి తన భక్తులకు తనపై పరమ భక్తిని కలిగేటట్లు అనుగ్రహిస్తాడు. ఇతడే జగత్కారణభూతుడు. వేదాలను కోల్పోయి, అజ్ఞానంతో అలమటించే బ్రహ్మకు మళ్ళీ తిరిగి ఆ వేదాలను అనుగ్రహించిన స్వామి ఇతడే కనుక, మన అజ్ఞానాన్ని అంతటినీ పోగొట్టి, సరి అయిన జ్ఞానాన్ని అనుగ్రహించగలిగిన స్వామి, ఇతడు. భక్తుల మనసులకు ఏనాటికీ తృప్తిని కలిగించని అమృతంవంటివాడు. తమస్సును తరిమికొట్టే దీపం వంటి స్వభావాన్ని కలవాడు.

★★★★★

# గోదాదేవి సూక్తులలో భగవద్రామానుజులు

ఋషులు క్రాంతదర్శులు. భూత భవిష్య వర్తమాన కాలాలలోని విషయాలను అన్నిటిని దర్శించగలవారు. "ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోనుధావతి" అని కవివచనం. మహర్షి పలికిన మాట సంభవించి తీరుతుంది అనే విషయం శాస్త్ర ప్రసిద్ధం, లోకర ప్రసిద్ధం కూడా.

భగవంతుడైన శ్రీమన్నారాయణుని అనుగ్రహించేత నిర్దుష్టమైన జ్ఞానాన్ని పొందిన దివ్య సూరులు మహర్షి తుల్యులు అని అనడంలో లోటు లేదు. వారి సూక్తులలో ఎన్నో జరిగిన, జరుగబోయే వృత్తాంతాలు చోటు చేసుకున్నాయి. ఉదాహరణకు, నమ్మాళ్వార్ల "కలియుమ్ కెడుమ్ కండుకొణ్ మిన్" అనే సూక్తి భవిష్యత్తులో సంభవించబోయే భగవద్రామానుజుల అవతారాన్ని సూచించింది అని మన పూర్వాచార్యుల అభిప్రాయం. ఈ విధంగానే గోదాదేవి అనుగ్రహించిన నాచ్చియార్ తిరుమొழி అనే ప్రబంధంలో "విణ్ణీల మేలాప్పు" అనే ఒక దశకంలోని అన్ని పాశురాలలో శ్రీరామానుజుల చరిత్ర సూచింపబడింది అని శ్రీకాంచీ అణ్ణంగరాచార్యస్వామివారు వివరించారు. ఈ దశకంలో గోదాదేవి మేఘాన్ని శ్రీ వేంకటేశ్వరుని దగ్గరకు దూతగా పంపుతున్నది. ఈ మేఘం నిరవధిక కృపా స్వభావులైన భగవద్రామానుజులే అని వారి వివరణం. దీనికి అనుగుణంగా ఈ దశకంలో మేఘానికి ప్రయోగింపబడిన విశేషణాలు పద సందర్భాలు శ్రీరామానుజుల చరిత్రను, వైభవాన్ని తెలుపుతున్నవి అని వారి అభిప్రాయం.

1) మొదటి పాశురంలో "విణ్ణీల మేలాప్పు" అని అంటూ మేఘానికి వితానసామ్యం చెప్పబడింది. ఈ వితానం ఆదిశేషుడే అని చెప్పవచ్చు. శ్రీకృష్ణుడు జన్మించిన తరువాత వసుదేవుడు స్వామి రేపల్లెకు తీసుకొని పోయేటప్పుడు అతనిపై మంచు, వర్షం పడకుండా ఆదిశేషుడు వితానంగా మారి సేవ చేసినట్లు శ్రీ విష్ణుపురాణం, భాగవతం మొదలైన గ్రంథాలు తెలుపుతున్నవి. అందించేత ఇక్కడ చెప్పబడిన వితానం ఆదిశేష స్వరూపులైన

భగవద్రామానులే. ఈ విధంగా ఇక్కడ శ్రీరామానుజుల అవతార రహస్యం సూచించబడింది అని చెప్పవచ్చు.

2) రెండవ పాశురంలో"మాముత్త నిది శొరియుమ్ " అని గొప్ప ముత్యాలముగ్గులను నిధులను మేఘం వర్షిస్తున్నట్లు గోదాదేవి తెలిపింది. ఇక్కడ మేఘం నిధులను వర్షించడం నవనిధుల వంటి తొమ్మిది గ్రంథాలను శ్రీ రామానుజులు అనుగ్రహించే విషయం సూచిస్తున్నది.

3) మూడవ పాశురంలో మేఘాలను "అళియత్త మేకజ్గాళ్" (కృపను చూపే మేఘాలలారా! ) అని సంబోధించింది. "దయైక సింధోః" అనే విధంగా కరుణకు అద్వితీయ సముద్రం భగవద్రామానుజులు. వారికి పూర్వం ఉన్న ఆచార్యులు అందరూ అనువృత్తి ప్రసన్నాచార్యులు కాగా, శ్రీ రామానుజులు కృపా మాత్ర ప్రసన్నాచార్యులు కదా. శ్రీ రామానుజుల ఈ స్వభావాన్ని వారి వేరొక అవతారంగా చెప్పబడే శ్రీ వరవర మునులు ఉపదేశరత్తినమాలై ప్రబంధంలో "ఓ రాణ్ వழி" అనే పాశురంలో కీర్తించారు.

4) నాలుగవ పాశురంలో "మిన్నాక త్తెழுకిన్ద మేకజ్గాళ్" (రూపంలో మెరపు ప్రకాశించే మేఘాలలారా! ) అనే సంబోధన శ్రీ రామాంజనేయ దివ్య మంగళ విగ్రహ సౌందర్యాన్ని సూచిస్తున్నది ఇక్కడ చెప్పబడిన మెరుపు తీగ ఆ విధంగా ప్రకాశించే, శ్రీ రామానుజుల రూపంలో ధగధగ మెరిసే యజ్ఞోపవీతమే. శ్రీ రామానుజుల అభిషేక గద్యలో "సౌదామినీ సవర్ణసువర్ణ యజ్ఞసూత్రముమ్" అని వారి యజ్ఞోపవీతం బంగారు రంగులో మెరుస్తున్నదని చెప్పబడింది కదా.

5) ఐదవ పాశురంలో "వాన్ కొండు కిళర్ న్దెழுన్ద" అని అంటూ మేఘాలు ఆకాశాన్ని అంతటినీ గ్రసించినట్లుగా వ్యాపించినట్లు వర్ణింపబడింది. ఇక్కడ మేఘాలు ఆకాశాన్ని గ్రహించడం శ్రీరంగనాథుడు శ్రీ రామానుజులకు

రెండు విభూతులను ఇచ్చిన వృత్తాంతాన్ని సూచిస్తున్నది. ఇక్కడ ఆకాశమనే అర్థమిచ్చే వాన్ అనే పదం పరమాకాశమైన పరమపదాన్ని సూచిస్తుంది.

6) ఆరవ పాశురంలో "జలమ్ కొండు కిళర్ న్దెళ్ళున్ద" అని అంటూ మేఘాలు జలాన్ని స్వీకరించి, ఆకాశంలోకి వచ్చి న విషయం తెలుపబడింది. ఇక్కడ మేఘాలు నీటిని గ్రహించడం శ్రీరామానుజులు శ్రీ వరదరాజ స్వామి ఆరాధన కోసం శాల క్కిణరు అనే బావినుండి తీర్థానికి తీసుకొని రావడం సూచిస్తుంది.

7) ఏడవ పాశురంలో "శంగమా కడల్ కడైందాన్" అని క్షీర సాగర మథన వృత్తాంతం ప్రస్తావింపబడింది. భగవంతుడు పాల సముద్రాన్ని చిలికి, అమృతాన్ని సంపాదించి దేవతలకు అందరికీ ఇచ్చాడు కదా. ఈ వృత్తాంతం భగవద్రామానుజులు క్షీరసాగరం వంటి తిరువాయ్ మొళ్ళి ప్రబంధాన్ని మథించి, అందులోని అమృతావంటి అర్థాలను అందరికీ పంచిన సంగతి సూచింపబడుతున్నది. తిరువాయ్ మొళ్ళి ప్రబంధం "ద్రావిడ వేద సాగరమ్" అన్నట్టు ఒక సముద్రం కదా. ఈ ప్రబంధాన్ని శ్రీరామానుజులు అభివృద్ధి చేసిన విషయం "మెయ్ మ్ బాల్ వళర్ త్త ఇదత్తాయ్ ఇరామానుశన్" (తిరువాయ్ మొళ్ళి ప్రబంధాన్ని అభివృద్ధి చేసిన హితపరురాలైన తల్లి శ్రీరామానుజులు) అనే తనియన్ సూక్తి తెలుపుతున్నది.

8) ఎనిమిదవ పాశురంలో "కార్ కాలత్తెళ్ళుకిన్ఱ మాముకిల్ కాళ్" (వర్షాకాలంలో కనిపించే నల్లని మేఘాలలారా! ) అనే సంబోధన ఉన్నది. ఇక్కడ (వర్షాకాల సమయంలో నల్లని మేఘాలు కనిపించడం సాంసారిక దుఃఖాలను అనుభవించే మనలను రక్షించడం కోసం అంతులేని దయ కలిగిన రామానుజులనే నల్లని మేఘం అవతరించడానికి తెలుపుతుంది.

9) తొమ్మిదవ పాశురంలో "మదయానై పోలెళ్ళున్ద మా ముకిల్ కాళ్" (మదగజంవలె కనిపించే మేఘాలలారా! ) అనే సంబోధన ఉన్నది.

ఇక్కడ చెప్పబడిన గజ సామ్యం భగవద్రామానుగులకు కల గజసామ్యాన్ని సూచిస్తున్నది. "రామానుశ మదవేழమ్" అని ఇరామానుశ నూற்றన్దాది ప్రబంధంలో శ్రీరామానుజులు మదగజంతో సమానంగా కీర్తింపబడుతున్నారు కదా. అంతేకాక "పెరుగు మదవేழమ్" అనే ముదలాళ్వారుల పాశురంలో వర్ణింపబడిన మదగజం శ్రీరామానుజులే అని సంప్రదాయం.

ఈ విధంగా గోదాదేవి సూక్తులలో ఈ రామానుజ వైభవం సూచింపబడడం సహృదయహృదయానందకరం కదా.

★★★★★

## భగవద్రామానుజులు – ఆళ్వారుల శ్రీసూక్తి

(మహావిద్వాన్, కాంచీ ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్యస్వామివారు 10–5– 1949 వ తేదీన ప్రకటించిన "శ్రీ రామానుజన్ – 9" అనే తమిళ మాసపత్రికనుండి గ్రహించి, అనువదింపబడింది)

★★★★★

**సూక్తిః శ్రీశఠకోపముఖ్యమునివర్యాణాం హృదా భావయన్**
**శ్రీరామానుజయోగిరాట్ వ్యరచయత్ శారీరకవ్యాకృతిమ్,**
**శ్రీగీతావివృతిం తథా ఽ న్యసుకృతీ శ్చేత్యుచ్యతే దేశికైః**
**జ్ఞాతజ్ఞేయసమస్తవేదకథితార్థైః నః ప్రమాణైః సహ.**

★★★

భగవద్రామానుజులు ఇంచుమించుగా ఆళ్వారుల దివ్యసూక్తులను అనుసరించి శ్రీభాష్యం, గీతా భాష్యం మొదలైన గ్రంథాలను అనుగ్రహించారు – అని మన పూర్వాచార్యుల నిశ్చితమైన అభిప్రాయం. "భాష్యకారర్ ఇదు కొండు సూత్ర వాక్యజ్గళ్ ఒరుంగ విడువర్" (భాష్యకారులు ఆళ్వారుల శ్రీసూక్తులను పురస్కరించుకొని బ్రహ్మసూత్ర వాక్యాలను సమన్వయం చేస్తారు) అని ఆచార్య హృదయ గ్రంథంలో స్పష్టంగా నాయనార్ అనే ఆచార్యులు ఈ విషయాన్ని అనుగ్రహించారు. దీనికి సాక్ష్యంగా మనం పలుచోట్ల ఉదాహరణలను గమనించవచ్చు. ఇప్పుడు, ఒకటి, రెండు దృష్టాంతాలను ప్రస్తావించడం జరుగుతున్నది.

భగవద్గీతలో (15 –18) "యస్మాత్ క్షర మతీతో ఽ హమ్" అనే శ్లోకంలో "అతో ఽ స్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః" అని ఉన్నది. ఇక్కడ, "లోకే వేదే చ" అనే ప్రయోగానికి "లోకంలోనూ, శాస్త్రంలోనూ" అనే అర్థం సాధారణంగా ఎవరికైనా స్ఫురిస్తుంది. భగవద్గీతను వ్యాఖ్యానించిన ఇతర భాష్యకారులు ఈ విధంగా వ్యాఖ్యానం చేయడాన్ని గమనిస్తాము. కానీ, భగవద్రామానుజులు అయితే, తమ గీతా భాష్యంలో, ఈ విధంగా ఇక్కడ

అర్థాన్ని చెప్పారు. "వేదార్థావలోకనాత్ లోక ఇతి స్మృతిరిహ ఉచ్యతే. శ్రుతౌ, స్మృతౌ చ ఇతి అర్థః" (వేదార్థాలను దర్శించినందువల్ల, ఇక్కడ లోకశబ్దంచేత స్మృతి చెప్పబడుతున్నది. అందువల్ల, వేదంలోనూ, స్మృతులలోను –అని అర్థం) అనేది గీతాభాష్య శ్రీసూక్తి. ఇక్కడ, "లోకః" అనే పదానికి కరణే వ్యుత్పత్తితో శాస్త్రం అనే అర్థం చెప్పబడింది. "ఈ విధంగానే, ఇక్కడ అర్థాన్ని గ్రహించాలి" అని గీతా భాష్య తాత్పర్యచంద్రికలో వేదాంతదేశికులు కూడా ఉపపాదనం చేశారు. లోక శబ్దానికి ఈ విధంగా శాస్త్ర పరత్వం గ్రహించినవారు ఎవరూ లేరు. లోకశబ్దానికి శాస్త్రం అని అర్థం ఉన్నట్లుగా కోశాలలో కూడా కనబడడం లేదు. "లోక స్తు భువనే జనే" అని మాత్రమే అమరకోశంలో ఉన్నది. మిగిలిన కోశాలలో కూడా లోకపదానికి అర్థం ఈ విధంగానే కనబడుతున్నది. ఈ విధంగా ఉండగా, శ్రీరామానుజులు లోకపదాన్ని శాస్త్రపర్యాయంగా గ్రహించి, అర్థాన్ని చెప్పడానికి ఏమి మూల కారణం? అని ఇక్కడ పరామర్శించవలసి ఉన్నది.

నమ్మాళ్వారులు ఒక శ్రీసూక్తియే దీనికి మూల కారణం – అని మన పెద్దల అభిప్రాయం. ఇది ఇక్కడ వివరింపబడుతున్నది.

నమ్మాళ్వార్లు తిరువాయ్ మొళి ప్రబంధంలో "ఒన్టుమ్ తేవుమ్" అని ఆరంభం అవుతున్న దశకంలో (4 –10 –6) , "పోற்றி మற்றோர் దెయ్ వమ్" అనే పాశురంలో "ఎల్లీరుమ్ వీడు పెற்றாల్ ఉలకిల్లై యెన్టే" అని అన్నారు. ఈ దశకంలో శ్రీమన్నారాయణుని పరత్వాన్ని ఉపదేశించాలని ప్రయత్నించే ఆళ్వారులను ఉద్దేశించి "శ్రీమన్నారాయణుడే సర్వేశ్వరుడు అయితే, అతడు తననే ఆశ్రయించేటట్లుగా మమ్ములను చేయకుండా, ఇతర దేవతలను అశ్రయించేటట్లుగా ఎందుకు చేస్తున్నాడు?" అని కొందరు ప్రశ్నించగా, దానికి అళ్వార్లు సమాధానం చెప్పే రీతిలో ఈ పాశురం అవతరించింది.

ఈ పాశురంలో "ఎల్లీరుమ్ వీడు పెற்றாల్ ఉలకిల్లై యెన్డే" అనేదే ప్రాణస్థానీయమైన ప్రయోగం. అందరూ శ్రీమన్నారాయణునే కొలిచినట్లయితే, అందరూ మోక్షాన్ని పొంది, లీలావిభూతి సమూలంగా లేకుండా పోతుంది. ఆ విధంగా కాకుండా ఉండడం కోసంగా భగవంతుడు మిమ్ములను ఇతర దేవతా భజనాన్ని చేసి, సంసారులుగా పడి ఉండేటట్లుగా చేసి వేశాడు – అనేది ఈ పాశురానికి ఆపాత ప్రతీతిలో అర్థం తోచవచ్చు.

దశోపనిషద్ భాష్యకారులైన రంగరామానుజముని సంస్కృతంలో తాము తిరువాయ్ మొళి ప్రబంధానికి అనుగ్రహించిన ఒన్బదినాయిరప్పడి వ్యాఖ్యానంలో ఈ విధంగా ఉండే అర్థాన్నే తెలియజేశారు. "భవాదృశానాం సర్వేషాం మోక్షలాభే, లీలా విభూత్యంతర్భూతలోకానాం ఉచ్ఛేద ఏవ స్యాదితి మత్వైవ భగవతా స్వవిషయే భక్తిమనుత్పాద్య, దేవతాంతర విషయే భక్తిరుత్పాదితేతి భావః" (మీవంటివారికి అందరికీ మోక్షం లభించినట్లయితే లీలావిభూతిలో అంతర్భవించిన లోకాలకు అన్నిటికీ లేకుండా పోయే స్థితి ఏర్పడుతుంది – అని భావించి, భగవానుడు తన విషయంలో మీకు భక్తిని కలుగజేయకుండా, అన్య దేవతల విషయంలో భక్తిని కలిగేటట్లు చేశాడు– అని భావం) అనేది ఆ స్వామి వ్యాఖ్యానంలో సూక్తి.

అయితే, తిరుక్కురుగైప్పిరాన్ పిళ్ళాన్, నంబిళ్ళై మొదలైన పూర్వాచార్యులు తమ తమ వ్యాఖ్యానాలలో వ్యక్తం చేసిన అర్థం ఈ విధంగా లేదు. మరి ఏ విధంగా ఉన్నది? అని అంటే, "ఉలకిల్లై యెన్డే" అనే ప్రయోగంలోని "ఉలగు"శబ్దానికి శాస్త్రం– అని అర్థం. తీవ్రమైన పాపాన్ని చేసిన మీరు కూడా, గొప్ప పుణ్యం వల్ల లభించే మోక్షాన్ని పొందినవారైనట్లయితే, శాస్త్ర మర్యాద అనేదే లేకుండా పోతుంది – అని భావించే భగవానుడు మిమ్ములను దేవతాంతర ప్రాణ్యాన్ని కలిగినవారినిగా చేసి వేశాడు. "వారు వారు చేసిన పుణ్య పాప రూప కర్మలకు తగిన విధంగా ఫలం ఇవ్వాలి" – అని

ఒక శాస్త్ర మర్యాదను భగవానుడు ఏర్పాటు చేశాడు. మీరు, మీ ముందు జన్మలలో చాలా ప్రబలమైన పాపాలను చేసినవారు అయినందువల్ల, వాటి ఫలంగా ఈ జన్మలో క్షుద్ర దేవతా భజనం చేసే రీతిలో విధంగా మిమ్ములను భగవానుడు ఉపేక్షించవలసి వచ్చింది. క్రూరమైన పాపాలను చేసిన మిమ్ములను కూడా, పుణ్యాత్ములనువలె, శ్రీమన్నారాయణ సమాశ్రయణమే చేసేటట్లుగా చేసి నట్లయితే, అప్పుడు, ఇంతకు ముందు చెప్పిన శాస్త్ర మర్యాద అనేది లేకుండా పోతుంది కదా. ఆ విధంగా శాస్త్ర మర్యాద పోకుండా ఉండడం కోసమే మిమ్ములను ఈ విధంగా నిలిపివేశాడు – అనేదే ఆళ్వారుల అభిప్రాయాన్ని అనుసరించి అర్థం – అని మన పూర్వాచార్యులు ఉపపాదించారు. వేదాంత దేశికులు కూడా ద్రవిడోపనిషత్ తాత్పర్య రత్నావళిలో "తత్తత్కర్మానురూపం ఫల వితరణతః" అని అంటూ ఈ అర్థాన్నే ప్రకటించారు.

అందువల్ల, ఆళ్వారుల మనసును అనుసరించి ఇక్కడ "ఉలగు" అనే పదానికి శాస్త్రమని అర్థం స్పష్టం అయినందువల్ల, దీనిని అనుసరించియే శ్రీ రామానుజులు భగవద్గీతలో "అతో ౽ స్మి వేదే లోకే" అనే సందర్భంలో ఉండే లోకశబ్దాన్ని శాస్త్ర పరంగా అన్వయించి అర్థం చెప్పారు – అని తెలియ వస్తున్నది. ఈ గీతాశ్లోకాన్ని, ఆ పాశురంలోని వాక్యాన్ని తమ వ్యాఖ్యానంలో పెరియ వాచ్చాన్ పిళ్లై, వడక్కు త్తిరువీది ప్పిళ్ళై ప్రస్తావించారు.

భగవద్రామానుజులకు ముందేష శ్రీయామునులు లోకపదాన్ని శాస్త్రపరంగా ప్రయోగించారు. స్తోత్ర రత్నంలో " న నిందితం కర్మ తదస్తి లోకే" (శాస్త్రంలో చెప్పబడిన పాపాలలో, నేను, దేనినీ విడచిపెట్టకుండా, అన్నిటినీ చేశాను) (23) అనే చోట వ్యాఖ్యానించిన పెరియ వాచ్చాన్ పిళ్ళై "ఆయిరమడంగు ఎన్నాల్ పణ్ణప్పడాదదు యాదొరు నిందిత కర్మ ముణ్డు, అతిపాతక మహాపాతకాదికళ్, అదు శాస్త్రత్తిల్ ఇల్లై. –––అనుష్ఠాతాక్కళ్

పక్కల్ ఇల్లాద నిషిద్ధంగళుమ్ శాస్త్రత్తిల్ కాణలామిఱే" (అదిపాతక మహాపాతకాదిరూపంలోనిది, వేయిసార్లు నా చేయబడనిది అయిన నిందిత కర్మంలు ఏవి ఉన్నదవి అవి శాస్త్రంలో కూడా లేవు. అనుష్ఠాతల విషయంలో లేని నిషిద్ధ కర్మలు కూడా శాస్త్రంలో గమనించవచ్చు కదా) అని అనుగ్రహించారు. ఈ సందర్భంలో వేదాంతదేశికులు కూడా స్తోత్ర భాష్యంలో "లోక్యత అనేనేతి లోకః. ప్రమాణమ్, తస్మిన్ నాస్తి. అప్రామాణిక మిత్యర్థః. అత్ర శాస్త్రరూపప్రమాణ విశేష వివక్షా" (దీని ద్వారా దర్శింపబడుతుంది కనుక, ప్రమాణం లోకమని చెప్పబడుతున్నది అందులో లేదు. అంటే, అప్రామాణికం – అని అర్థం. ఇక్కడ శాస్త్ర రూపమైన ప్రమాణంలో వివక్ష) అని అనుగ్రహించారు. వీటిని బట్టి భగవద్యాములు కూడా లోకశబ్దాన్ని శాస్త్ర పరంగానే గ్రహించారు – అని స్పష్టం అవుతున్నది.

ఈ విధంగా శ్రీయామునులు, భగవద్రామానుజులు లోకశబ్దాన్ని శాస్త్రపరంగా గ్రహించడం ఆళ్వారులు అనుగ్రహించిన శ్రీసూక్తిని అనుసరించియే – అనే విషయాన్ని ఇంకా ఒక నిరూపణం ద్వారా దృఢపరుస్తాను

ఉపనిషత్తు పరబ్రహ్మ లక్షణాన్ని చెప్పే సమయంలో, "యతో వా ఇమాని భూతాని జాయంతే" అని మొదలు అయే వాక్యం ద్వారా, సృష్టి స్థితి సంహారాలు అనే మూడిటిని మాత్రమే చెప్పింది. అయితే, భగవద్రామానుజులు, శ్రీయామునులు మోక్ష ప్రదత్వం అనే ఒక కృత్యం కూడా విలక్షణమైనదిగా అనుగ్రహించారు. ఎక్కడ? అని అంటే,

భగవద్రామానుజులు శ్రీభాష్యంలో మంగళరూపమైన ఆరంభ శ్లోకంలో "అఖిల భువన జన్మ భంగాదిలీలే" అని అంటూ సృష్టి స్థితి సంహారాలను చెప్పి, ఆ తరువాత, వెంటనే రెండవ పాదంలో "వినత వివిధ భూతవ్రాత రక్షైక దీక్షే" అని అంటూ అనుగ్రహించారు. దీనివల్ల

మోక్షప్రదత్వం చెప్పబడినదిగా శ్రుతప్రకాశికాచార్యులవారు వ్యాఖ్యానించారు. భగవద్యామునులు స్తోత్ర రత్నంలోని 20వ శ్లోకంలో, "జగదుద్భవ స్థితి ప్రణాశ" అని లోకాల సృష్టి స్థితి సంహారాలను చెప్పి, ఆ తరువాత, సంసార విమోచన పదంతో మోక్షప్రదత్వాన్ని ప్రత్యేకంగా అనుగ్రహించారు. "యతో వా ఇమాని భూతాని" అని మొదలవుతున్న ఉపనిషద్ వాక్యంలో వేద పురుషుడు సృష్టి స్థితి సంహారాలను మాత్రమే చెప్పి, మోక్షప్రదత్వాన్ని ప్రత్యేకంగా చెప్పకపోవడం ఎందుకు? అని అంటే, దీనిని రక్షణలో కానీ, సంహారంలో కానీ, అంతర్భవింప చేయవచ్చు – అనే ఉద్దేశంతోనే. శ్రీయామునులు, శ్రీరామానుజులు అయితే, దానిని ప్రత్యేకంగా ప్రస్తావించడం ఎందువల్ల? అని అంటే,

తిరువాయ్ మొళి ప్రబంధంలో నమ్మాళ్వార్లు "పత్తుడై యడివర్ క్కెళియవన్" (1–3) అనే దశకంలోని రెండవ పాశురంలో "వీడామ్ తెళితరు నిలైమై యతొழிవిలన్" (మోక్షాన్ని అనుగ్రహించడం అనే స్థితిని ఏనాడూ లేకుండా ఉండేవాడు) అని అనుగ్రహించారు. మోక్షం అనే ప్రకాశించే స్థితిని అనుగ్రహించడం –అనే మోక్షప్రదత్వ స్థితిని ఏనాడూ ఎప్పటికీ కలిగి ఉండేవాడు– అనేది ఇక్కడ పాశురంలోని అర్థం. ఇంతే కాకుండా, భగవానుని మోక్షప్రదత్వ గుణాన్నిగూర్చి అనుగ్రహించడం కోసంగా అళ్వారులు ఒక దశకాన్ని ఆ ప్రబంధంలో అనుగ్రహించారుకూడా. అది, "అణైవది అరవణమేల్" (2–8) అనే దశకం. ఇందువల్ల, నమ్మాళ్వారుల అభిప్రాయంలో భగవంతునకు గొప్ప లక్షణంగా మోక్షప్రదత్వం అనే గుణం విశేషంగా ప్రకాశిస్తున్నది – అనే విషయాన్ని గ్రహించి, శ్రీయామునులు, భగవద్రామానుజులు ఆ గుణాన్ని ప్రత్యేకంగా, విశేషంగా ప్రస్తావించి పలికారు – అనేది ఇక్కడ తెలియదగిన విషయం.

★★★★★

సాంప్రదాయిక వ్యాస మాలిక

# విశిష్టాద్వైతం అనాది

(శ్రీవైష్ణవరత్నమాల అనే గ్రంథంలో ప్రచురింపబడిన పండిత రాజ తిరువరంగం తిరుమల తాతాచార్యస్వామివారి ద్రావిడవ్యాసానికి అనువాదం)

★★★

కళ్ళు, చెవులు మొదలైన జ్ఞానేంద్రియాల ద్వారా పలు వస్తువులను మనం తెలుసుకుంటున్నాము. ఈ జ్ఞానానికి ప్రత్యక్షం అని పేరు. నదిలో నూతన ప్రవాహం వస్తే, దాని ఉత్పత్తి స్థానంలో వర్షం కురుస్తున్నది అని తెలుసుకుంటున్నాము. ఇంటి లోపల మనం ఉన్నప్పుడు, పిడుగు శబ్దం వింటే, ఆకాశంలో మేఘం ఉన్నది అని తెలుసుకుంటున్నాము. ఈ విధమైన జ్ఞానానికి అనుమానం అని పేరు. కొన్ని సమయాలలో దారాన్ని చూచి పాము అని భావిస్తున్నాము. ఇది ప్రత్యక్షమే అయినప్పటికీ, యథార్థమైన జ్ఞానం కాదు. చాలిన అయిన వెలుతురు లేదు అనే కారణంచేత ఈ ప్రత్యక్ష అయథార్థజ్ఞానం అవుతున్నది. ఈ విధంగానే, పలు విధాలైన దోషాల వల్ల అనుమానంకూడా అయథార్థజ్ఞానంగా అవుతున్నది. ఈ విధంగా కాకుండా, ఏ విధమైన దోషం లేనప్పుడు ఏర్పడే ప్రత్యక్షం, అనుమానం యథార్థజ్ఞానం అవుతున్నవి. వీటివల్ల తెలియబడే వస్తువులు అంతా యథార్థమైన వస్తువులు అవుతాయి. దారంలో తోచిన పాము జ్ఞానం దోషం వల్ల ఏర్పడుతున్నది. దగ్గరకి వెళ్లి చూసినప్పుడు, “ఇది పాము కాదు దారమే” అనే యథార్థమైన జ్ఞానం కలుగుతుంది ఈ విధంగా జ్ఞానం కలిగిన తరువాత, ఏ కాలంలోనూ బాధింపబడనిది, ఏ విధమైన దోషం లేనిది అయిన జ్ఞానమే యథార్థజ్ఞానం. దీనివల్ల గ్రహింపబడే వస్తువు యథార్థమైన వస్తువు. “సూర్యుడు ఉన్నాడు” –అనే విషయాన్ని ప్రత్యక్షం వల్ల, “భూమి అతని చుట్టి వస్తున్నది, రాత్రి పగలు అందువల్ల ఏర్పడుతున్నాయి” అనే జ్ఞానం అనుమానం వల్ల తెలిసికుంటున్నాము. ఈ

ప్రత్యక్షంలోను, అనుమానంలోనూ ఏ విధమైన దోషం కనబడనందున, అనంతర కాలంలో వీటికి బాధ అనేది లేనందువల్ల, ఇవి యథార్థ జ్ఞానం అని, సూర్యుడు మొదలైన వస్తువులు యథార్థమైన వస్తువులు అని నిశ్చయం కలుగుతున్నది. అందువల్లనే, లోకంలో ఉండే యథార్థమైన వస్తువులను తెలుపడానికి ప్రత్యక్షం, అనుమానం అనే రెండు ప్రమాణాలు ఉన్నాయి అనేది తెలుస్తున్నది.

ప్రత్యక్ష, అనుమానం – అనే ఈ రెండు ప్రమాణాల కంటే మూడవ ప్రమాణం ఒకటి ఉన్నది. అది వేదం. వేదం అనే పదానికి "జ్ఞానాన్ని కలిగించేది" అని అర్థం. ఇక్కడ, జ్ఞానం అని సామాన్యంగా చెప్పబడినప్పటికీ, ప్రత్యక్షం, అనుమానం అని ఇంతకు ముందు చెప్పిన రెండు ప్రమాణాలవల్ల తెలియబడని వస్తువులనుగూర్చి ఏర్పడే జ్ఞానమే ఇక్కడ గ్రహింపబడుతున్నది. వాటివల్ల తెలియబడిన వస్తువులనే ఇది చెప్పినట్లయితే, ఇది కేవలం అనువాదం అవుతుంది తప్ప, ప్రమాణం కాబోదు. వేరొక ప్రమాణంచేత చెప్పబడిన వస్తువును చెప్పే పదం అనువాదం అనుబడుతున్నది. అందువల్ల, దానికి ప్రమాణం అనే స్థితి తొలగిపోయి, అప్రమాణం అనే స్థితి రాకుండా ఉండడం కోసం, మిగిలిన ప్రమాణాల చేత తెలియబడని వస్తువును తెలుపడంలోనే వేదంలో దృష్టి – అని తీర్మానం చేయబడింది.

ఈ విధంగానే ప్రత్యక్షంచేత, అనుమానంచేత నిశ్చయింపబడిన, సిద్ధమైన ఒక వస్తువును విరుద్ధమైన, అంటే, దానితో విరోధం కల ఒక వస్తువును వేదం తెలిపినట్లయితే, అది అపుడు ప్రమాణం కాకుండా, అప్రమాణమై పోతుంది. అందుచేత, మిగిలిన ప్రమాణాలచేత తెలియబడిన వస్తువులతో విరోధం లేనివి అయిన వస్తువులను తెలియజేసి, వేదం ప్రమాణం అవుతున్నది – అని సిద్ధాంతం. ఈ విధంగా ప్రమాణం అయిన వేదంలోని వాక్యాలనుండి వాటి అర్థాన్ని గ్రహించడంకోసం మనం ప్రవర్తించేటప్పుడు, మనకు పలు సందేహాలు ఏర్పడడం సహజం. ఈ విధంగా ఏర్పడే సందేహాలు

తొలగి, "ఈ వాక్యానికి ఈ విధంగానే అర్థం గ్రహించాలి, ఈ విధంగా గ్రహించకూడదు" అని నిర్ణయించుకోవడానికి తగిన వాక్యన్యాయాలు అనేకం ఉన్నాయి. వీటిని అన్నిటిని కూర్చి, మీమాంస అనే ఒక అరుదైన శాస్త్రాన్ని జైమిని మహర్షి రచించారు. ప్రత్యక్ష, అనుమానాలచేత తెలియడానికి సాధ్యం కానివి, వాటిచే తెలియబడినవాటికి విరుద్ధం కానివి అయిన అర్థాలనే వేదం తెలుపుతున్నది అని, ఇంతకు ముందు చెప్పబడిన సిద్ధాంతం – వీరు రచించిన మీమాంసా శాస్త్రంలో చేయబడినది, వైదికులు అందరి చేత అంగీకరింపబడినది అయిన సిద్ధాంతమే.

ఈ మహర్షి ఈ మీమాంసాశాస్త్రంలో, వేదంలో మొదటి భాగంలో విధింపబడిన కర్మలు అనే ధర్మాలను ప్రధానవిషయంగా గ్రహించి, వాక్యన్యాయాలను వివరించారు. వీరికి ఆచార్యులు వ్యాసులు అని, బోధాయనులు అని ప్రసిద్ధులైన మహర్షి. వేదంలోని చివరి భాగాలై, అందువల్లనే వేదాంతాలు అని పిలువబడేవి అయిన ఉపనిషత్తులు ఉపదేశించే పరబ్రహ్మను ప్రధాన విషయంగా గ్రహించి, ఉపనిషత్తులలోని వాక్యాలనుండి ఈ పరతత్వాన్ని, దీనిని గూర్చిన మిగిలిన విషయాలను ఎటువంటి సందేహం లేకుండా నిశ్చయించుకోవడానికి తగినట్లుగా, విశేషన్యాయాలను కూర్చి, బ్రహ్మమీమాంస అనే బ్రహ్మ సూత్రాలను రచించినా, జైమిని నిరూపించిన వేదప్రామాణ్యంలోని ప్రకారాన్ని, ప్రమాణవాక్యాలనుండి వాటి అర్థాన్ని నిశ్చయించుకోవడానికి తగిన న్యాయాలను ఆ విధంగానే అంగీకరించారు.

ఈ విధంగా ఈ ఇద్దరు మహర్షులు నిర్ణయించిన న్యాయాలను పురస్కరించుకునే మనం వేదంలోని అర్థాన్ని నిర్ణయం చేయాలి. వేదాంతం అని పిలువబడే ఉపనిషత్తు కూడా వేదంలో ఉండే ఒక భాగమే కనుక, వేదంలోని మిగిలిన భాగాల వలెనే, అది, ఎవరిచేత రచింపబడకుండా, అనాదిగా ఉన్నందువల్ల, మానవులు రచించిన గ్రంథాలకువలె, వీటికి ఏ

విధమైన దోషం చెప్పడానికి వీలు లేదు. అందువల్ల, జైమిని మహర్షి నిరూపించిన రీతిలో అది సంపూర్ణంగా ప్రమాణమై ఉన్నది. అయినప్పటికీ, దానిలో ఉండే వాక్యాలకు మహర్షులు తెలిపిన న్యాయాలను అనుసరించి అర్థాలను గ్రహించకుండా, వాటికి విరుద్ధంగా మనం ఒక అర్థాన్ని చెప్పినట్లయితే, అది ఉపనిషత్తుల అర్థం కాబోదు. అందుచేత, వాటికి విరుద్ధంగా ఉండకుండా, వాటిని అనుసరించే ఉపనిషత్తులలోని వాక్యాలకు పెద్దలు వ్యాఖ్యానం చేశారు. ఉపనిషత్తు అనేది ఏ మానవులచేత రచింపబడకుండా, అనాది కనుక, దాని యథార్థమైన అర్థంగా ఏ సిద్ధాంతం ఉన్నదో, ఆ సిద్ధాంతమే అనాది అని కదా ఏర్పడుతున్నది.

ప్రత్యక్షంగా పలు పలు రూపాలను, వాటికి కారణమైన పృథివి మొదలైన భూతాలను మనం చూస్తున్నాము. కంటికి కనిపించకుండా, వాటిలో అంతర్భవించి ఉండే శక్తులను అనుమానంతో తెలుసుకుంటున్నాము. ఇవి అన్నీ జడపదార్థాలు, అంటే, జ్ఞానం లేని వస్తువులు.

మన శరీరం ఐదు భూతాలతో ఏర్పడుతున్నది. దీని లోపల, దీని కంటే భిన్నమైన, ఆత్మ అనే జ్ఞానం కలిగిన వస్తువు ఒకటి ఉన్నది – అనే విషయాన్ని జ్ఞానం లేని అహం అనే ప్రత్యక్షంచేత, అనుమానంచేత తెలుసుకుంటున్నాము. ఒక శరీరంలో ఉండే ఆత్మ, వేరొక శరీరంలో ఉండే ఆత్మచేత అనుభవింపబడే సుఖదుఃఖాలను అనుభవించకుండా, ఒక్కొక్క శరీరంలోనూ వేరు వేరు ఆత్మ ఉన్నదని, అందువల్లనే, శరీరాలవలెనే ఈ ఆత్మలుకూడా అనేకం అని తెలుసుకుంటున్నాము. ఇవి జీవాత్మలు అనబడుతున్నాయి. ఇవి ఈ శరీరాలలో ఉంటూ, కోరిన వస్తువులను కోల్పోయి, కోరకపోయినా వచ్చే కష్టాలను అనుభవిస్తూ, బాధపడుతున్న అల్పశక్తిని, జ్ఞానాన్ని కలిగినవి జన్మిస్తూ, మరణిస్తూ క్లేశాలను అనుభవిస్తున్నవి.

ఈ విధమైన ఆత్మలు, వీటికి కల శరీరాలు, ఇంద్రియాలు, ప్రాణం, నివసించే చోటు, ఇవి అనుభవించే వస్తువులు – అని ఈ విధంగా ఉండే జడపదార్థాలు, అన్నీ కలిసే ఈ జగత్తు అవుతున్నది. ఒకడు సృష్టించకుండా ఈ లోకం ఉండడానికి అవకాశం లేదు. కనుక, దీనిని సృష్టించినవాడు ఒకడు ఉండి తీరాలి. అతడే ఈశ్వరుడు అని అనుమానంచేత ఈశ్వరుని కొందరు తెలుసుకుంటున్నారు. ఈ విధంగా తెలుసుకోవడానికి సాధ్యం కాదు – అని కొందరు అంటున్నారు. ఈ విషయం ఏ విధంగా ఉన్నప్పటికీ, ఈశ్వరునిగూర్చిన అన్ని విషయాలను తెలియజేయడమే ముఖ్యలక్ష్యంగా కలిగినవి ఉపనిషత్తులు కనుక, ఇదే ఈ విషయాలలో ప్రమాణం – అని అంటారు, పెద్దలు.

ఈశ్వరుని బ్రహ్మం అని, పరబ్రహ్మం అని ఉపనిషత్తులు చెబుతున్నాయి. పరబ్రహ్మం ఏది? అంటే, ఈ లోకాన్ని అంతటినీ సృష్టించి, రక్షించి, లయం చేసేది ఏదో, అదే పరబ్రహ్మం – అని ఉపనిషత్తులు తెలుపుతున్నవి. ఈ విధంగా లోకాన్ని అంతటికి కారణమైన పరబ్రహ్మం సర్వజ్ఞం అని, అన్ని విధాలయిన శక్తులను కలిగినది అనికదా ఏర్పడుతున్నది. అయినప్పటికీ, స్పష్టంగానే, ఈశ్వరుడు సర్వజ్ఞుడు అని, సర్వశక్తి అని, ఏ విధమైన దోషం, లోటు లేనివాడు అని, అన్ని విధాలైన మంగళగుణాలను కలిగినవాడు అని ఉపనిషత్తు కీర్తిస్తూ పలుకుతున్నది. తమ స్వరూపంతో జీవాత్మలు నిత్యులు. ఆ విధంగానే ఈశ్వరుడుకూడా నిత్యుడే. ఈ విధంగా కొన్ని విషయాలలో సామ్యం ఉన్నప్పటికీ, "జీవాత్మలు తాము కోరిన దానిని పొందడం అనేది పరబ్రహ్మం వల్లనే, వీరికి ఆవశ్యకమైనదానిని ఇచ్చేవాడు అతడే. జీవాత్మలు అనేకులు, అతడు ఒక్కడే"– అని, ఈ విధంగా భగవంతునకు, మనకు మధ్య తేడాను ఉపనిషత్తులు తెలుపుతున్నవి. ఈ విధంగానే అతనికి సమానమైనవాడు కానీ, అతని కంటే గొప్పవాడు కానీ

ఎవడు లేడు – అని కూడా పలుకుతున్నది. అందుకే, ఈశ్వరుడు ఒక్కడే అనేది నిశ్చయింపబడుతున్నది. అందుచేత, ఈశ్వరునకు సంబంధించినంతవరకు, ఉపనిషత్తు బోధించే సిద్ధాంతం అద్వైతమే. అంటే, రెండవ ఈశ్వరుడు ఎవడూ లేడు – అనే విషయంలో వివాదం ఏమీ లేదు. అయితే, అతడు జగత్కారణమై, సర్వజ్ఞుడై, సర్వశక్తియై, సకలకళ్యాణగుణపూర్ణుడై ఉండడం అంతా కూడా మాయాసంబంధంచేతనే. స్వయంగా అతడు ఏ విధమైన గుణాన్ని లేని, కేవల చైతన్యమే – అనేది ఉపనిషత్తుల సిద్ధాంతం కాదు. ఈశ్వరుని పలు పలు గుణాలను చాలా స్పష్టంగా విశదంగా ఉపదేశించే ఉపనిషత్తులకు ఈ విధంగా అర్థాన్ని గ్రహించడం ఏమాత్రం పొసగదు. ఇంకా చెప్పాలంటే, ఇది నేరుగా విరుద్ధమైనది. దానిని వంచించడానికి పనికి వస్తుంది, అంతే. నిర్గుణం అని పరమాత్మను ఉపనిషత్తు చెబుతున్నది కదా – అని అంటే, మీమాంసా న్యాయాలను పురస్కరించుకొని దీనికి ఏమి అర్థం అని నిశ్చయించాలి. ఆ విధంగా గమనించి చూసినప్పుడు, జీవాత్మలను బంధించి, సంసారంలో బాధలను పొందేటట్లుగా చేసే సత్త్వరజస్తమస్సులు అనే మూడు గుణాలు ఉన్నాయే, అవి లేనివాడు ఈశ్వరుడు అని ఈ నిర్గుణపదం తెలుపుతున్నది – అనేది ఏర్పడుతున్నది. అందుచేత, గుణవిశిష్టుడైన ఈశ్వరుని అద్వైతమే ఉపనిషత్తుల అభిప్రాయమై ఉన్నది.

ఇక, "సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసీత్, ఏకమేవ, అద్వితీయమ్" అని, సృష్టి ఆరంభంలో సత్తు అనబడే బ్రహ్మమే ఉన్నది, అది ఒక్కటే ఉన్నది, రెండవది ఏది లేదని కేవలం అద్వైతాన్ని స్పష్టంగా ఉపదేశిస్తున్నదే. దీనివల్ల శుద్ధబ్రహ్మం తప్ప మిగిలినది అంతా అసత్యం అని ఏర్పడుతున్నది కదా– అని అంటే, ఇక్కడకూడా ఈ అర్థం యథార్థమైన అర్థం కాదు. తరువాత "తదైక్షత"– ఆ పరబ్రహ్మం సంకల్పించింది – అని బ్రహ్మం సంకల్పించినట్లుగా చెప్పడం వల్ల, ఇక్కడ సత్ అని నిర్గుణ బ్రహ్మం

ఉద్దేశింపబడలేదు– అనే విషయం స్పష్టపడుతున్నది. "సత్ అనే బ్రహ్మమే ఉన్నది" అని అన్నందువల్ల, ఈ ఉపనిషత్తే తరువాత తెలియజేసిన విధంగా, అసత్తు లేదు – అని నిషేధం చేయబడుతున్నదే తప్ప, అనదగిన ఏ వస్తువు నిషేధింపబడినట్లు కాబోదు.

"ఏకమేవ" –ఒకటే ఉన్నది – అనే విషయంకూడా, తరువాత "బహుస్యాం ప్రజాయేయ" అని సంకల్పించి, ఆ విధంగానే అనేకవిధాలుగా పరబ్రహ్మం అయినది – అని ఉపనిషత్తులలో చెప్పబడినందువల్ల, సృష్టికి తరువాత అది ఏ విధంగా పలు రూపాలను పొందిందో, ఆ విధంగా కాకుండా, సృష్టికి ముందు ఒక్కటే రూపంలో ఉన్నది – అనే అర్థాన్ని కలిగినది– అనేది ఇక్కడ స్పష్టపడుతున్నది.

"పరబ్రహ్మం మొదట ఒకటిగానే ఉన్నది, తరువాత అనేకంగా మారింది" అని అంటే, "ఇది మట్టి, మొదట ఒకటిగానే ఉన్నది, తరువాత అది చట్టి, బాన అని ఈ విధంగా అనేక విధాలుగా అయినది", అని చెప్పినట్లు అవుతున్నది. ఇక్కడ, ఒకటిగానే ఉన్న మట్టి అనేక విధాలుగా మారడానికి కారణంగా కుమ్మరివాడు ఒకడు ఉన్నట్లుగానే, సత్తు అనేది పలు విధాలుగా మారడానికి కారణంగా, దాని కంటే వేరుపడినవాడు ఒకడు ఉండి ఉండాలి కదా? ఆ కారణం ఎవరు? అనే సందేహం ఇక్కడ ఏర్పడుతున్నది. ఆ సందేహాన్ని పోగొట్టడంకోసమే వేదంలో "ఏకమేవ, అద్వితీయమ్" –రెండవదిగా, వేరొకటి ఏమీ లేనిదై సత్తు ఉన్నది – అని చెప్పబడింది. అందుచేత ఇక్కడ, ప్రమాణాల చేత తెలియబడిన ఏ వస్తువుకు నిషేధం లేదు. ప్రత్యక్షంచేత, అనుమానంచేత తెలియబడిన విషయాలను విడచి, ఆ ప్రత్యక్షం చేత, అనుమానంచేత తెలియడానికి సాధ్యం కాని విషయాలలోనే వేదం ప్రమాణం– అని స్థాపించబడినదై ఉన్నందువల్ల, మనం చూచే ఈ లోకాన్ని అసత్యం అని అనడంలో ఉపనిషత్తులకు అభిప్రాయం ఉండదు. ఇది

దీనిని అసత్యంగా చేయడానికి దానికి శక్తి కూడా లేదు. ఈ లోకాన్ని ఆ విధంగానే యథార్థంగా గ్రహించి, ఈ లోకానికి, ఈశ్వరునికి మధ్య ఉన్నదై, మనం తెలియనిది అయిన సంబంధాన్ని ఉపదేశించడంలోనే ఉపనిషత్తుకు ఉద్దేశ్యం ఉన్నది.

జ్ఞానం లేనిది, లోకంలో ఉండే అన్ని రూపాలుగాను మారుతున్నది – ప్రకృతి అనే జడపదార్ధం. జ్ఞానం ఉన్నందువల్ల, దీనికంటే విలక్షణమైనది అయిన జీవాత్మ అణువుగాను, ఈశ్వరునకు పరతంత్రంగానూ ఉన్నది. అంతటా వ్యాపించి ఉన్నవాడై, స్వతంత్రుడై, సర్వజ్ఞుడై ఉన్నందువల్ల, ప్రకృతి జీవాత్మలనే తత్వాలు కంటే పూర్తిగా ఈశ్వరుడు విలక్షణమైన తత్వమై ఉన్నాడు. ఈ విధంగా, ఈ మూడు తత్వాలు పరస్పరం భేదాన్ని కలిగినవై ఉండగా, "ఈ లోకం అంతా ముందు బ్రహ్మం గానే ఉన్నది" అని వేదం అభేదంగా చెప్పడం ఏ విధంగా? అనే ఒక పెద్ద ప్రశ్న ఇక్కడ ఏర్పడుతున్నది.

దీనికి ఉపనిషత్తులలోని వాక్యాలను గ్రహించే సమాధానాన్ని చెబుతారు, మన పెద్దలు. "నేను అనేకంగా కాగలను, అందుకోసం జన్మిస్తాను" అని పలికిన ఉపనిషత్తు, ఆ తరువాత, " అది అగ్ని అయినది, అగ్ని అయి జన్మించింది" అని చెప్పకుండా, "తత్తేజో అసృజత" – అది అగ్నిని సృష్టించింది – అని చెబుతున్నది ఇక్కడ, సృష్టికర్త అయిన బ్రహ్మం వేరు, సృష్టింపబడినది అయిన అగ్ని వేరు – అనేది స్పష్టం అవుతున్నది. ఈ విధంగా భేదాన్ని స్పష్టంగా చెప్పిన అదే ఉపనిషత్తు,, ఆ తరువాత, " ఆ అగ్నినుండి జలాన్ని సృష్టిస్తాను –అని సంకల్పించింది, ఆ విధంగానే జలాన్ని సృష్టించింది " అని చెప్పకుండా, "ఆ అగ్ని చూచింది. అనేకంగా కాగలను. అందుకోసం జన్మిస్తాను –అని అది జలాన్ని సృష్టించింది" అని పలికింది. ఇందువల్ల, అగ్నిని తెలిపే పదమే బ్రహ్మాన్ని కూడా తెలుపుతుంది – అని ఉపనిషత్తు తెలుపుతున్నది. "ఐక్షత" – చూచింది – అని సంకల్పం చెప్పబడినందువల్ల, జలాన్ని సృష్టించిన అగ్ని, కేవలం జడపదార్థమైన అగ్ని కాదు. బ్రహ్మంగానేకదా

అది ఉండి ఉండాలి. దీనివల్ల జడవస్తువు అయినందువల్ల బ్రహ్మచేత సృష్టింపబడినదిగా అయినందువల్ల, అగ్ని బ్రహ్మం కంటే వేరుపడినది అయినప్పటికీ, బ్రహ్మాన్ని అగ్నిగానే చెప్పవచ్చు – అని ఇక్కడ వివరింపబడినట్లు అవుతున్నది. దీనివల్ల, మిగిలిన ప్రమాణాలచేత తెలియబడిన భేదాన్ని ఆ విధంగానే ఒప్పుకొని, అభేదంగా శాస్త్రం పలుకుతున్నది– అనే అపూర్వమైన ఒక విషయం ఇక్కడ స్పష్టపడుతున్నది. ఇక, ఇది, ఏ విధంగా పొసగుతుంది? అని గమనించి చూడాలి. దీనిని ఈ ఉపనిషత్తే వివరిస్తున్నది.

పైన కనబడే ప్రకరణాలలో, "ఈ జీవులు అందరూ బ్రహ్మంనుండే పుడుతున్నారు, బ్రహ్మంలోనే నిలచి ఉన్నారు. చివరిలో ఆ బ్రహ్మంలోని ఐక్యం అవుతున్నారు" అని చెప్పబడుతున్నది. సృష్టింపబడే ఒక్కొక్క ద్రవ్యానికి కారణావస్థ, కార్యావస్థ, నాశం – అనే మూడు అవస్థలు ఉన్నాయి. భగవంతునిచేత సృష్టింపబడిన చేతనాచేతన సర్వవస్తువులు, ఈ మూడు దశలలోనూ, అతనిలోనే ఉన్నాయి. ఆ పరమాత్మను విడచి ఏ సమయంలోనూ ఉండవు. ఏ స్థితిలోనూ తనను విడచి ఉండని ఈ వస్తువులను అన్నిటిని తన ఇష్టానుసారంగా ఆ యా స్థితులలో భగవానుడు నిలుపుతున్నాడు. ఈ విధంగా, తనను విడచి ఉండని ద్రవ్యాలను తన ఇష్టానుసారంగా నియమనం చేస్తూ ఉండే, జ్ఞానం కల ఈ వస్తువుకు విలక్షణమైన ఒక పేరు ఉన్నది. దానిని చెబుతూ, పైన ఉపనిషత్తు పలుకుతున్నది. ఉద్దాలకుడు తన పుత్రుడైన శ్వేతకేతువునకు ఉపదేశిస్తున్నాడు – అనే క్రమంలో, "ఇంతవరకు నేను ఉపదేశించిన పరతత్త్వాన్ని ఆత్మగా కలిగినదిసుమా, మనం చూచే ఈ లోకం అంతా. అది సత్యం, అది ఆత్మ" అని అంటూ లోకంలో అంతర్భవించి ఉండే ఒక్కొక్క వస్తువుకు కూడా భగవానుడు ఆత్మ, ఒక్కొక్క ద్రవ్యం అతనికి శరీరం" అని చెప్పినట్లయినది.

## విశిష్టాద్వైతం అనాది

ఈ విధంగా, భగవంతునకు, లోకానికి మధ్య ఉండేది శరీరాత్మభావ సంబంధం అనడంలో భావం ఏమంటే– శరీరాన్ని నిర్దేశించే పదాలు అన్నీ ఆత్మను నిర్దేశిస్తాయి అనే. "ఈ బ్రాహ్మణుడు విద్వాంసుడు" అని అంటున్నాము. ఇందులో, ఈ ప్రయోగంలో, లోక రీతిలో, దోషం ఏమీ లేదు. అయినా, ఇందులో ఒక ఆక్షేపం ఉన్నది. అది ఏమంటే, ఆత్మలో బ్రాహ్మణత్వజాతి లేదు. శరీరత్వంలోనే ఉన్నది. అందుకే బ్రాహ్మణశబ్దం శరీరాన్ని నిర్దేశిస్తుంది. అయితే, విద్వాంసుడు అనే పదం శరీరాన్ని నిర్దేశిస్తున్నది కనుక, అందులో చేరదు. ఎందుకంటే, శరీరం జ్ఞానం కలిగినది కాదు కనుక. అందుచేత, ఈ విధంగా చెప్పడం సరి కాదు – అని అనవచ్చు. అయినా, బ్రాహ్మణుడు అనే పదం "బ్రాహ్మణ శరీరాన్ని కలిగినవాడు"– అనే అర్థంలోనే ఉపయోగింపబడుతున్నందువల్ల, అటువంటి శరీరాన్ని కలిగిన ఆత్మ జ్ఞాని అయినందువల్ల, ఈ ప్రయోగం లో ఏ విధమైన దోషం లేదు – అనేది ఇక్కడ సమాధానం. ఈ న్యాయాన్ని ఇక్కడ చూపించినందువల్ల, పూర్వం శరీరమైన అగ్నిని నిర్దేశించే శబ్దాన్నే దానికి ఆత్మ అయిన పరబ్రహ్మం అనే అర్థంలో ప్రయోగించడం అనేది సరియే అనేది నిరూపింపబడినది అవుతున్నది ఈ నిరూపణాన్ని ఊర్జితం చేయడం కోసమే, మొదట "తత్త్వమసి" – ఆ పరబ్రహ్మం నీవై ఉన్నావు– అని ఉపనిషత్తులో చెప్పబడింది. "నీవు శరీరమై ఉండగా, నీకు ఆత్మవై ఉండేది ఇదే. లోకానికి అంతటికి ఆత్మ అయి ఉండేది ఈ పరబ్రహ్మమే నీకు కూడా ఆత్మ" అని ఇక్కడ తాత్పర్యం. ఈ విధంగా లోకానికి, భగవంతునికి మధ్య ఉండే కార్యకారణభావాన్ని ఉపదేశించే శాస్త్రం శరీరాత్మభావాన్నికూడా ఉపదేశిస్తున్నది. అందుచేత, భగవంతుడు సకలకల్యాణగుణవిశిష్టుడు అయినట్లుగానే, ఏ దశలో అయినా చేతనాచేతన సకలవిశిష్టుడై ఉన్నాడు అనేది సిద్ధిస్తున్నది.

ఈ నిర్ణయంలో, లోకాన్ని అసత్యం అనడం, ప్రత్యక్ష అనుమానాలను పలు పలు భేదశ్రుతులను అప్రమాణాలు అని చెప్పడం, అభేదశ్రుతికి లక్షణను

గ్రహించి, జీవాత్మకు పరమాత్మకు మధ్య భేదాన్ని తెలియజేసే ప్రత్యక్షాది సకలప్రమాణాలకు విరోధం వచ్చే రీతిలో అర్థాన్ని గ్రహించడం– అని ఈ విధంగా ఉండే దోషాలు ఏమీ లేకుండా, సర్వప్రమాణాలు, సర్వశ్రుతివాక్యాలు చాలా అనుకూలంగా ఉన్నందువల్ల, సకలకల్యాణగుణ సకలచేతనాచేతన విశిష్టుడైన శ్రీమన్నారాయణుడు ఒక్కడే తత్త్వం – అనే విశిష్టద్వైతసిద్ధాంతమే ఉపనిషత్తుల సిద్ధాంతం –అనేది, అందువల్ల ఇదే అనాది సిద్ధాంతం అనేది విజ్ఞులు అందరూ అంగీరించిన, అంగీకరించవలసిన విషయం.

భగవద్బోధాయనులు మొదలైన మహర్షులు ఆదరించిన సిద్ధాంతం కూడా ఇదే అయినందువల్ల, ఇదే అనాది అనేది కాదనడానికి వీలు లేని విషయం. వేదంలోని కర్మకాండం అనబడే మొదటి భాగాన్ని పురస్కరించుకొని చూస్తేకూడా, ఈ విశిష్టాద్వైతసిద్ధాంతం అందులో కూడా అంతర్భవించి ఉన్నది – అనేది స్పష్టపడుతుంది.



# శ్రీకృష్ణసూరి – శ్రీదేశికుల ఐకకంఠ్యమ్

★★★★

**శ్రీమద్దేశికకృష్ణసూరిగురురాట్ శ్రీసూక్తిరత్నక్రమే**
**భాస్వద్భావసమత్వ మార్యవిబుధైః స్వాద్యం చ భావ్యం సదా,**
**ప్రస్తుత్యాల్పధియా మయాత్ర లిఖితం యత్తత్ భవేత్ప్రీతయే**
**సారాసారవివేకినాం సుమనసాం నిర్మత్సరే మానసే.**

★★★★

ఉభయ వేదాంత రహస్యార్థాలను నమ్పిళ్ళై సన్నిధిలో సాక్షాత్తుగా శ్రవణం చేసి, వాటిని గ్రంథస్థం చేసినవారు ఇద్దరు. వారు, శ్రీకృష్ణ సూరి అనబడే పెరియ వాచ్చాన్ పిళ్ళై, శ్రీకృష్ణ పాదులు అనబడే వడక్కు త్తిరువీధి ప్పిళ్ళై అనే ఇద్దరు ఆచార్యులు. వీరిలో, శ్రీకృష్ణ పాదులు గ్రంథస్థం చేసిన వాఖ్యానాలు శ్రీ వేదాంతదేశికులకు లభించే అవకాశం లేక పోయింది. కానీ, పెరియ వాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానాలు అన్నీ దేశికుల కాలంలో విశేషమైన ప్రచారాన్ని పొందినందు వల్ల, వాటిని "అముదిలుమ్ ఆற்ற இనిదు" (అమృతం కంటే మధురమైనది) అనే ప్రతిపత్తితో దానిని సాదరంగా అనుభవించినవారిలో ప్రధానులుగా వెలుగొందినవారు దేశికులు. దీనికి లెక్కలేనన్ని సాక్ష్యాలు ఉన్నాయి. వాటిలో కొన్నిటివి మాత్రం ఇక్కడ ప్రస్తావించడం జరుగుతున్నది.

దేశికులు ద్రవిడోపనిషత్తాత్పర్య రత్నావళిని అనుగ్రహించేటప్పుడు, శ్రీకృష్ణ సూరి అనుగ్రహించిన ఇరుపత్తు నాలాయిరప్పడినే ఆధారంగా చేసుకుని ఆ గ్రంథాన్ని అనుగ్రహించారు– అనేదానిని అవిచాల్యంగా, పలుమార్లు నిరూపించవచ్చు.

ముందుగా, శ్రీకృష్ణ సూరి సూక్తులను దేశికులు అనుసరిస్తూ తమ రచనలను చేశారు అనేదానికి స్తోత్రరత్నభాష్యంలోని ఐదారు సందర్భాలు ఇక్కడ ప్రస్తావించబడుతున్నాయి.

స్తోత్రరత్నభాష్యంలో ఒక్కొక్క శ్లోకంలోని దేశికుల భాష్యాన్ని, ఆ స్తోత్రానికి శ్రీకృష్ణ సూరి అనుగ్రహించిన వ్యాఖ్యానాన్ని, రెండిటిని దగ్గరగా చేర్చి పరిశీలించినట్లయితే, ఈ కృష్ణ సూరి వ్యాఖ్యాన ప్రభావం దేశికుల సూక్తిపై ఎంత ఉందో స్పష్టం అవుతుంది.

ముందుగా, "నమోఽ చింత్యాద్భుత" అనే మొదటి శ్లోకంలో గమనిద్దాం. శ్రీకృష్ణ సూరి ఉదాహరించిన సంస్కృత ప్రమాణాలలో నూటికి ఎనభై శాతం ప్రమాణాలను దేశికులు విడువలేరు ఇది అనుమానం కాదు, ఉత్ప్రేక్ష అసలే కాదు. ఉల్లేఖం కానే కాదు. ఈ రెండు వ్యాఖ్యానాల గ్రంథాలు సులభంగా లభిస్తాయి కదా. వాటిని పరిశీలించు చూస్తే, ఈ అంశం స్పష్టం అవుతుంది.

మొదటి శ్లోకంలో "జ్ఞాన వైరాగ్యరాశయే" అనే చోట, వారిరాశిక, జలరాశి అనే ప్రయోగాలలోవలె, జ్ఞాన వైరాగ్యాలకు రాశి అయి ఉండేవారు – అనే అర్థమే అందరికీ సులభంగా తోస్తుంది. ఇది సంగతమైన అర్థమే తప్ప అసంగతమైన అర్థం కాదు. ఈ విధమైన అర్థాన్నే ముందుగా వివరించారు, దేశికులు. అంతటితో ఊరుకోకుండా,, శ్రీకృష్ణ సూరి ఈ సందర్భంగా అనుగ్రహించిన వ్యాఖ్యానాన్ని కూడా దేశికులు అనుసరించారు.

శ్రీకృష్ణ సూరి ఈ సందర్భంగా బహువ్రీహి సమాసాన్ని వివక్షించి, రాశి అనే పదానికి "సమూహం" అనే అర్థాన్ని గ్రహించి, జ్ఞాన సమూహాలను, వైరాగ్యసమూహాలను కలిగినవారు – అని వివరించి, జ్ఞానం వైరాగ్యం అనేవి ఒకటిగానే ఉండగా, వాటికి రాశి అని వివరించవచ్చునా? అని శంకను లేవనెత్తి, భగవంతుని స్వరూపాదులు ఇక్కడ జ్ఞానానికి విషయాలు కనుక, అవి అనేకం

కనుక, జ్ఞానాలు కూడా అనేకం అని, త్యాజ్య విషయాలు కూడా అనేక విధాలుగా ఉంటాయి కనుక, వైరాగ్యాలు కూడా అనేకం అని చెప్పవచ్చు – అనే సమాధానాన్ని తెలియజేశారు.

దేశికులు తమ భాష్యంలో ఈ వివరణను యథాతథంగా సంస్కృతీకరించారు. ముందుగా ఇక్కడి దేశిక స్తోత్ర భాష్య సూక్తిని గమనిద్దాం–

"జ్ఞానాదే రక్షయత్వవ్యంజనార్థ మిహ తదాశ్రయే రాశిశబ్దః. అచింత్యత్వాది విశిష్టౌ జ్ఞానవైరాగ్యరాశీ యస్యేతి బహువ్రీహిర్వా. తదా తు, జ్ఞానవైరాగ్యయోః ప్రత్యేకం భేద మనుసంధాయ రాశిత్వక్లుప్తిః" (శ్రీనాథమునుల జ్ఞానం, వైరాగ్యం మొదలైనవి అక్షయమైనవి అని వ్యక్తం చేయడం కోసం వాటి ఆశ్రయంలో రాశిశబ్దప్రయోగం చేయబడింది. ఈ అర్థంలో, "జ్ఞాన వైరాగ్యయోః రాశిః యః సః" అని తత్పురుష సమాసాన్ని గ్రహించాలి. లేక, ఆచింత్యత్వం, అద్భుతత్వం, అక్లిష్టత్వం – అనే వైలక్షణ్యాలతో కూడిన జ్ఞాన వైరాగ్య రాశులు ఎవరికి ఉన్నాయో, ఆ నాథమునులు – అని అర్థం. ఈ అర్థంలో బహువ్రీహి సమాసాన్ని చెప్పుకోవాలి. ఈ విధంగా బహువ్రీహి సమాసాన్ని చెప్పుకున్నప్పుడు, నాథమునుల జ్ఞానం, వైరాగ్యం – అనేవి ప్రత్యేకంగా వాటికి లక్ష్య భూతాలైన విషయాలు అనేకం కనుక, లక్ష్యమైన విషయాల అనేకత్వాన్ని పురస్కరించుకొని ఆ జ్ఞాన వైరాగ్యాలు కూడా అనేకం అని భావించి, రాశి శబ్ద ప్రయోగం చేయబడింది.)

**ఇప్పుడు శ్రీకృష్ణ సూరి ఈ ప్రయోగాన్ని వివరించే ప్రకారాన్ని అనుసంధిద్దాం.**

(రాశయే) "రాశిః" ఎన్ఱు సమూహమ్. జ్ఞానరాశయే, వైరాగ్యరాశయే. జ్ఞానవైరాగ్యమ్ ఇరణ్డా యిరుక్క, రాశి ఎన్బానేన్? ఎన్నిల్, భగవత్స్వరూపరూప గుణ విభూతిగళై జ్ఞానత్తుక్కు విషయమాక్కుకైయాలే

పల. "పితరం మాతరమ్" ఎన్డు త్యాజ్యముమ్ పల వాకైయాలే సమూహమెన్నలామ్. (రాశయే. రాశి అంటే, సమూహం. జ్ఞానరాశి, వైరాగ్యరాశి – అని అర్థం. జ్ఞానం వైరాగ్యం అనేది రెండే అయినప్పుడు రాశి అని ఎందుకని అంటున్నారు? అని అంటే, భగవంతుని స్వరూప రూప గుణ విభూతులను తమ జ్ఞానానికి స్వయంగా చేసుకున్న జ్ఞానాలు అనేకం. ఆ విధంగానే, "పితరం మాతరం దారాన్" అని సోపాధికులైన తండ్రి, తల్లి, భార్య, పుత్రులు, బంధువులు, స్నేహితులు, గురువులు మొదలైనవారిని విడచి – అని చెప్పినట్లుగా విడువ వలసినది కూడా అనేకంగా ఉన్నందువల్ల, సమూహం అని చెప్పవచ్చు. అందువల్ల, రాశి శబ్ద ప్రయోగం సార్థకం)

ఇక్కడ ప్రస్తావించిన దేశికుల శ్రీసూక్తిని, శ్రీ కృష్ణ సూరి శ్రీసూక్తిని పోల్చి చూసినట్లయితే, ఈ రెండు సూక్తుల మధ్య ఉండే ఐకమత్యం సులభంగా స్పష్టం అవుతుంది.

2) ఈ శ్లోకంలోనే, "భగవద్భక్తిసింధవే" అనే చోట, "భక్తికి సముద్రమై ఉండేవారు" అనే అర్థాన్ని గ్రహించకుండా, "కాదల్ కడల్ పురైయ విళైవిత్త" (ప్రేమను సముద్రం నిండేటట్లుగా వృద్ధి పొందించి)" కాదర్ కడలిల్ మిక ప్పెరిదు, ఆల్! " (ప్రేమ సముద్రం కంటే పెద్దది, ఆహా! ) అని మొదలైన దివ్యసూరి సూక్తులకు అనుగుణంగా, భక్తిని సముద్రంగా రూపించి, "అగాధమైన భక్తి సింధువును కలిగినవారు" అని వివరించారు, శ్రీకృష్ణ సూరి.

శ్రీ వేదాంతదేశికులు ఈ వివరణ సూక్తిని స్పృశిస్తూ, "భక్తిం వా సింధుత్వేన రూపయిత్వా బహువ్రీహిః" (భక్తిని సముద్రంగా రూపణం చేసి, బహువ్రీహి సమాసాన్ని చెప్పవచ్చు) అని ఈ ప్రయోగాన్ని వివరించారు.

3) "న నిందితం కర్మ తదస్తి లోకే" అనే ప్రయోగంలోని "లోకే" అనే పదానికి, "సంసారిజనే" అని మొదట సామాన్యంగా అర్థాన్ని తెలిపిన దేశికులు, తరువాత, "శాస్త్రంలో" అనే శ్రీకృష్ణ సూరి చూపిన అర్థాన్ని తెలిపారు.

ఈ పదానికి శ్రీకృష్ణసూరి అనుగ్రహించిన ———అతిపాత మహాపాతకాదికళ్, అదు శాస్త్రత్తిలుమ్ ఇల్లై. "లోక్యత అస్మిన్నితి లోకః" శాస్త్రమ్. అనుష్ఠాతాక్కళ్ పక్కల్ ఇల్లాద నిషిద్ధఙ్గళుమ్ శాస్త్రత్తిల్ కాణలామిఱే. ' (అది పాత మహాపాతకాదులు. శాస్త్రాలలో కూడా లేవు ఇక్కడ లోకశబ్దానికి " లోక్యత ఇతి లోకః" – దర్శింపబడేది కనుక, లోకమని చెప్పబడుతున్నది" అనే వ్యుత్పత్తిని బట్టి శాస్త్రమనే అర్థాన్ని చెప్పాలి. ఆచరించేవారిలో గోచరించని నిషిద్ధ కర్మలు కూడా శాస్త్రాలలో కనుపిస్తాయి కదా) అనే వివరణను ఇక్కడ స్మరించాలి.

4) ఆ విధంగానే, "వశీ వదాన్యో గుణవాన్" అనే శ్లోకంలో శ్రీయామునులు ప్రస్తావించిన భగవద్గుణాల స్వరూపాన్ని వివరించేటప్పుడు, వేదాంతదేశికులు, ఇంచుమించుగా శ్రీకృష్ణ సూరి వ్యాఖ్యానాన్ని అనుసరించి చేశారనేది ఆ రెండు వ్యాఖ్యానాలను గమనించి చూసినపుడు స్పష్టమవుతుంది. ఈ విషయం ఈ శ్లోకానికి వీరిద్దరు అవతారికను అనుగ్రహించిన రీతిలోనే స్పష్టం అవుతుంది.

**వేదాంతదేశికులు ఈ శ్లోకానికి అవతారికను అనుగ్రహిస్తూ–**

"ఏవం భగవతః పరత్వం ప్రపంచితమ్ అనంతరమ్ ఆభిగామిక గుణముఖేన సౌలభ్య ముచ్యతే. వశీతి. యద్వా, విభూత్యానంత్య ముక్తమ్. అథాత్ర గుణానంత్యోక్తిః. (ఈ విధంగా ఇంతవరకు భగవంతుని పరత్వం వివరింపబడింది. తరువాత, భగవంతుని దగ్గరకు చేతనుడు వచ్చి చేరడానికి అనుగుణమైన గుణాలను తెలుపడం ద్వారా సౌలభ్యం తెలుపబడుతున్నది– "వశీ" –అని ఆరంభించి. లేక, ఇంతవరకు భగవంతుని విభూతి అనంతమైనదని చెప్పబడింది. ఇక, ఇందులో గుణాలు అనంతాలు అని చెప్పబడుతున్నది.)

ఇది, వేదాంతదేశికులు అనుగ్రహించిన అవతారిక.

**ఇప్పుడు శ్రీకృష్ణ సూరి అనుగ్రహించిన అవతారికను గమనిద్దాం.**

"కీழ், శరణ్యనుడైయ ఉత్కర్షమ్ శొల్లి, ఇదిల్, ఉభయ విభూతి నాథనై నమ్మాల్ కిట్టలామో? ఎన్ను కూశాదపడి ఆశ్రితర్ క్కు ఇழிయుమ్ తుఱైయాన కళ్యాణ గుణంగళిలే పన్నిరెండు గుణంగళై అరుళిచ్చెయ్ కిఱార్. అథవా, కీழ் సర్వేశ్వరత్వమ్ శొల్లిற்றாయ్, ఇని, శొల్లప్రాప్తమాన సమస్త కళ్యాణ గుణాత్మకత్తైయై అరుళి చ్చెయ్ కిఱార్ – ఎన్నుమామ్" (ఇంతకు ముందు శరణ్యుని గొప్పతనాన్ని చెప్పి, ఈ శ్లోకంలో, "ఉభయ విభూతినాథుని మనం దరి జేరగలమా?" అని జంకనక్కర లేని రీతిలో ఆశ్రితులు ఆశ్రయించడానికి అనుకూలమైన కళ్యాణ గుణాలలో, 12 గుణాలను ప్రస్తావిస్తున్నారు – అని చెప్పవచ్చు. లేక, ఇంతకు ముందు భగవంతుని సర్వేశ్వరత్వం చెప్పబడినదై, ఇకపై చెప్పవలసి ఉన్న సమస్త కళ్యాణ గుణాత్మకత్వాన్ని తెలియజేస్తున్నారు– అని కూడా చెప్పవచ్చు)

ఈ రెండు అవతారికలను గమనించి చూస్తే నీటి మధ్య ఉండే ఐకకంఠ్యం సులభంగా తేటతెల్లం అవుతుంది.

ఇక ఈ శ్లోకంలో ప్రస్తుతింపబడిన గుణ స్వరూపాలను వివరించేటప్పుడు కూడా, ఈ ఇద్దరి ఆచార్యుల సూక్తి సామ్యం సులభంగా గోచరం అవుతుంది. ఉదాహరణకు, "వశీ" అనే మొట్టమొదటి గుణ స్వరూప నిరూపణాన్ని రెండు వ్యాఖ్యానాలలోను గమనిద్దాం.

ముందుగా, వేదాంతదేశికుల సూక్తిని అనుసంధిద్దాం.

"(వశీ) వశః– ప్రభుత్వమ్, ఆయత్తత్వం వా, తద్వాన్ వశీ. తథాచ నైఘంటుకాః– "వశో జనస్పృహా యత్తేష్వాయత్తత్వ ప్రభుత్వయో" రితి. తత్ర, ప్రభుత్వార్థః – సర్వస్య వశీ సర్వస్యేశానః" జగద్వశే వర్తతేదం కృష్ణస్య సచరాచర" మిత్యాదిషు ప్రసిద్ధః. తథా పూర్వ శ్లోకే ప్రోక్తం పరిబృఢత్వం

గుణాంతర విధానార్థ మనూద్యతే. తస్మిన్ సతి హి వక్ష్యమాణ గుణాః భృశం శోభంతే. ఆయతత్వార్థే తు సంశ్రితాధీనతయా సౌలభ్యాతిశయః కథ్యతే. యథాహ స్వయమేవ– యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహ "మితి ఇమౌ స్మ మునిశార్దూల! కింకరౌ సముపస్థితౌ ఇతి చ. పాండవ దూతత్వ పార్థసారథిత్వాది వృత్తాంతాశ్చ ప్రసిద్ధాః"

(వశీ– "వశః" అంటే, ప్రభుత్వం, ప్రభువై ఉండడం ఆయత్తత్వం, అంటే ఒకనికి వశమై ఉండడం. ఈ స్వభావాలను కలిగినవాడు "వశీ". నిఘంటుకారులు– "వశో జనస్పృహా యత్నేష్వాయత్తత్వ ప్రభుత్వయోః" అని ఈ విధంగానే చెబుతున్నారు. ఈ రెండు అర్థాలలో, ప్రభువై ఉండడం– అని అర్థం "సర్వస్య వశీ సర్వస్యేశానః" (అందరినీ తన వశంలో కలవాడు, అందరినీ శాసించేవాడు) "జగద్వశే వర్తతేదం కృష్ణస్య సచరాచరమ్" (ఈ చరాచర జగత్తు అంతా కృష్ణుని వశంలో ఉన్నది – అని మొదలైన సూక్తులలో ప్రసిద్ధమైనది ఆ విధంగానే, ఇంతకు ముందు శ్లోకంలో చెప్పబడిన పరిబృఢత్వాన్ని, అంటే, ప్రభుత్వాన్ని వేరొక గుణం ద్వారా చెప్పడం కోసం అది అనువదింపబడుతున్నది. ఆ గుణం ఉంటే కదా, ఇకపై చెప్పబోయే గుణాలు గొప్పగా ప్రకాశిస్తాయి. ఇక, ఆయత్తత్వం– అనే అర్థంలో అయితే, తనను ఆశ్రయించినవారికి అధీనుడై ఉండడం వల్ల, ఈ గుణం ద్వారా భగవంతుని సౌలభ్యగుణంలోని అతిశయం చెప్పబడుతున్నది. ఈ గుణాన్ని గూర్చి భగవానుడే స్వయంగా, గీతలో "యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్ " (ఎవరైతే నన్ను భక్తితో ఆరాధిస్తున్నారో. నేను కూడా వారిని సులభుడనై ఉంటాను" అని, "ఇమౌ స్మ మునిశార్దూల! కింకరౌ సముపస్థితౌ" (ముని శార్దూలా! మేమిద్దరము నీకు సేవకులమై, నీ దగ్గరకు వచ్చాము) అని రామాయణంలో చెప్పాడు. భగవానుడు పాండవులకు దూతగా కావడం, అర్జునుని రథసారధి కావడం మొదలైన వృత్తాంతాలు కూడా ప్రసిద్ధమైనవి)

ఇక, ఇక్కడ, శ్రీకృష్ణ సూరి వివరణ సూక్తి విధంగా ఉన్నది.

"కీழ் చ్చొన్న ఈశితవ్యత్తైయై తన్ వశత్తిలే నడత్తి వర్తిక్కుమెన్గై. ఇత్తాలుమ్ స్వతంత్రన్ పక్కలిలే గుణమ్ కిడందాల్ అతు పెరు విలైయనా మెన్ను మిడమ్ శొల్లుకిఱదు. "సర్వస్య వశీ సర్వసేశానః" "జగద్వశే వర్తతేదమ్". అథవా, తన్నుడైయ తిరువడికళిల్ అనుకూల్య ముడైయార్ వశత్తి తాழநిఱ్కుమెన్నుమామ్. " ఇమౌ స్మ ముని శార్దూల! , కింకరౌ సముపస్థితౌ, ఆజ్ఞాపయ యథేష్టం వై శాసనం కరవామ కిమ్? "ఆజ్ఞాపయ మహాబాహో! బ్రూహి యత్తే వివక్షితమ్? ", "స్వయమేవ హరిర్వవ్రే విప్రపాదావనే జనమ్", "అనన్యాధీనత్వ "మిత్యాది. ఆశ్రిత పరతంత్ర నాయిరుక్కుమిరుప్పు పిఱర్ క్కావే ఎన్నాల్ నివారకర్ ఇల్లామైయాలే స్వాతంత్ర్య కార్యమాయిరుక్కుమ్."

(ఇంతకు ముందు చెప్పిన, శాసింపబడడం అనే స్వభావాన్ని తన వశంలో నడిపి నిర్వహిస్తాడు –అని భావం. ఇందువల్ల కూడా స్వతంత్రుడైనవాని వద్ద గుణం ఉంటే, అది గొప్ప విలువను కలిగినది అవుతుంది అనే విషయం తెలుపబడింది. "ఇమౌ స్మ ముని శార్దూల! , కింకరౌ సముపస్థితౌ, ఆజ్ఞాపయ యథేష్టం వై శాసనం కరవామ కిమ్? "(ముని శార్దూలా! మేమిద్దరం నీకు కింకరులమై ఉన్నాము. మమ్ములను నీ ఇష్టం వచ్చినట్లుగా ఆజ్ఞాపించు. నీ ఆజ్ఞను దేనిని మేము నిర్వర్తించాలి? ) , " ఆజ్ఞాపయ మహాబాహో! బ్రూహి యత్తే వివక్షితమ్? "ఓ మహాబాహూ! ఆజ్ఞాపించు. నీకు ఏమి అభిమతమో, దానివి చెప్పు) , " స్వయమేవ హరిర్వవ్రే విప్రపాదావనే జనమ్" (స్వయంగానే శ్రీకృష్ణుడు బ్రాహ్మణుల పాదాలను కడగడాన్ని వరించాడు) అని మొదలయిన ప్రమాణాల అర్థాలు, "అనన్యాధీనత్వమ్" అని అంటూ కూరేశులు వరదరాజస్తవంలో పలికిన శ్లోకంలోని అర్థం ప్రమాణాలు. భక్తులకు పరతంత్రుడై ఉండే స్థితి అనేది

ఇతరుల కోసం అని అంటే, దానిని నివారించేవారు లేనందువల్ల, భగవంతుని ఆ ఆశ్రితపారతంత్ర్యంకూడా స్వాతంత్ర్య కార్యమై ఉంటుంది.)

ఈ రెండు వివరణల వల్ల కూడా ఇద్దరి ఆచార్యవర్యులు సూక్తులలోని సామ్యం సులభతరంగా అవగతం అవుతున్నది.

ఇదేవిధంగా, మిగిలిన గుణాల వివరణ క్రమం, ఈ ఇద్దరి ఆచార్యుల వ్యాఖ్యానాలలో ఒకదానితో ఇంకొకటి పోలి ఉండడాన్ని గమనించవచ్చు.

5) ఇప్పుడు ఇంకొక సందర్భాన్ని గమనిద్దాం.

"ఆచింత్యదివ్యాద్భుత" (45) అనే మొదలయ్యే శ్లోకానికి శ్రీకృష్ణ సూరి అనుగ్రహించిన అవతారికనే వేదాంతదేశికులు కొంచెం పెంచి, సంస్కృతంలో అనుగ్రహించారు. ఈ విషయం ఈ రెండు అవతారికలను గమనించినప్పుడు వెల్లడి అవుతుంది.

ముందుగా, శ్రీకృష్ణ సూరి అనుగ్రహించిన అవతారికను సేవిద్దాం. అది ఈ విధంగా ఉన్నది.

"ఇప్పడి పిరాట్టియై ఉకప్పిక్కుఱ రసభావఙ్గళుక్కు ఆశ్రయమాన వడివైయుమ్, గుణంగళైమ్ అనుసంధిక్కిఱార్" (ఈ విధంగా లక్ష్మీదేవిని ఆనందింప చేసే రసభావాలకు ఆధారమైన దివ్య మంగళవిగ్రహాన్ని, కల్యాణగుణాలను అనుసంధిస్తున్నారు)

దీనిని అనుసరిస్తూ వేదాంతదేశికులు ఈ విధంగా అవతారికను అనుగ్రహించారు.

"అథ, ప్రథమ ప్రస్తుత యౌవన విశేషితాం, సర్వచిత్తాకర్షక సముదాయశోభామ్, ఆశయణీయత్వ భోగ్యత్వోపయిక గుణవిశేషాంశ్చ సంకలయ్యానుభవతి" (ఇప్పుడు, మొట్టమొదట ప్రస్తావించిన, యౌవనం కారణంగా ఏర్పడేది, అందరి మనసులను ఆకర్షించేది అయిన సముదాయ శోభను, అంటే, లావణ్యాన్ని, ఆశ్రయించదగి ఉండడానికి, భోగ్యమై

ఉండడానికి కారణమై ఉండే కల్యాణ గుణ విశేషాలను కలిపి ఇందులో అనుభవిస్తున్నారు.)

ఈ సూక్తి శ్రీకృష్ణ సూరి సూక్తికి సంస్కృతీకరణరూపమే అనేవి సుగమం.

6) ఈ శ్లోకంలోని "భక్తజనైకజీవితమ్" (45) అనే ప్రయోగానికి భక్తజనులకు ధారకం, పోషకం భోగ్యం అన్ని తానే అయినవాడు అని, భక్తజనాలను తనకు ధారకపోషక భోగ్యాలుగా కలిగినవాడు అని, ఈ విధంగా రెండు విధాలుగా అర్థాన్ని అనుగ్రహించారు శ్రీకృష్ణసూరి. వారి వ్యాఖ్యాన సూక్తి ఈ విధంగా ఉన్నది.

"ఎల్లామ్ కణ్ణన్ – ఎన్గిఱపడియే ఆశ్రితర్ క్కు ధారకాధికళెల్లామ్ తానేయా యిరుక్కుమవనై, భక్త జనంగళైయే తనక్కు ధారకమాక ఉడైయవన్ ఎన్నవుమామ్. "మమ ప్రాణా హి పాండవాః" (, నాకు ధారక పోషక భోగ్యాలు అన్నీ భగవానుడే" అని నమ్మాళ్వారులు చెప్పినట్లుగా, తనను ఆశ్రయించినవారికి తానే ధారక పోషక భోగ్యాలు అయినవాడు. లేక, "పాండవులు నా ప్రాణాలు కదా" అని చెప్పినట్లుగా, తనను ఆశ్రయించినవారిని తనకు ధారకాదులుగా కలిగినవాడు –అని కూడా అర్థం)

ఇదే అర్థాన్ని ఇచ్చే అవతారికను వేదాంత దేశికులు కూడా అనుగ్రహించారు. వారి వ్యాఖ్యాన సూక్తి ఈ విధంగా సాగింది.

"భక్తజనైకజీవితమ్– భక్తానాం ప్రధానజీవితమ్. మచ్చిత్తా మద్గతప్రాణా ఇత్యాదికమిహ భావ్యమ్. యద్వా, భక్త జనా ఏవైకజీవితం యస్య స తథోక్తః. తథావిధప్రీత్యతిశయాదేవ హి స్వయమేవ మాహ – జ్ఞానీ త్వాత్మైవ మే మతమితి. మమ ప్రాణా హి పాండవా ఇతి చ." (భక్తజనైక జీవితమ్– భక్తజనులకు ప్రధానమైన జీవితం. "నాలోనే మనసును కలిగినవారు నాలోనే ప్రాణాలను నిలుపుకున్న వారు" – అని ఈ విధంగా భగవానుడు గీతలో

పలికిన సూక్తులను భావించాల. లేక, భక్తజనులే ప్రధానమైన జీవితంగా కలిగినవాడు– అని అర్థం. అటువంటి గొప్ప ప్రీతి వల్లనే స్వయంగా "జ్ఞాని అయితే నాకు ఆత్మ" అని నా అభిప్రాయం అని, "పాండవులు నాకు ప్రాణాలు కదా" అని స్వయంగా అన్నాడు కదా)

7) ఇదే శ్లోకంలో తరువాత ఉండే "సమర్థమ్" అనే విశేషణానికి కూడా శ్రీకృష్ణ సూరి అనుగ్రహించిన వ్యాఖ్యానాన్ని అనుసరిస్తూ వేదాంతదేశికుల భాష్యం సాగింది. భగవంతునకు " సమర్థమ్" అని కదా ఇక్కడ విశేషణం ప్రయోగింపబడింది. క్షుద్రులమైన మనమందరం కూడా సమర్థులమని ప్రశంసింపబడుతున్నాము. భగవంతునికూడా సమర్థుడని అంటే, అతని సామర్థ్యం సామాన్యంగా ఉండదు కదా! ఇక్కడ ఏ విధమైన విశేషాన్ని తెలియజేయాలి? అని భావించిన శ్రీకృష్ణ సూరి, భగవద్యామునుల హృదయాన్ని యథాతథంగా గ్రహించి, తమ వ్యాఖ్యానంలో–

"(సమర్థమ్) అళవుడైయరాన నిత్యసూరికళ్ అనుభవిక్కుమ్ తన్నై నిత్యసంసారికళ్ అనుభవిక్కుంబడి "ஆற்றவల్ల వకై కాట్టు మమ్మానై" ఎన్గిఱపడియే, సాత్మిక్క సాత్మిక్క అనుభవిప్పిక్కుమ్ సామర్థ్యత్తై యుడైయవనై" అని అనుగ్రహించారు.

వాస్తవానికి భగవంతునకు ఇదే అద్భుతమైన సామర్థ్యం. ఈ వ్యాఖ్యాన పంక్తులను సేవించిన వేదాంత దేశికులు, ఈ అర్థాన్ని చాలా భోగ్యంగా గ్రహించి, దీనిని యథాతథంగా సంస్కృత భాషలో అనుగ్రహిస్తున్నట్లుగా తమ సూక్తిని "ఆశ్రితానాం సామ్య భోగప్రదానే" అని అనుగ్రహించారు.

"సాత్మ్యమ్" అనే సంస్కృత పదం కొంచెం అపూర్వమైనది. చరక సుశ్రుతాదులలో ఉపయోగించబడినది. మన పూర్వాచార్యుల దివ్య గ్రంథాలలో మాత్రమే ఈ పదం విశేషంగా కనబడుతుంది. తిరువాయ్ మొళి

దివ్యప్రబంధంలో "ఇవైయు మవైయు మువైయుమ్" (1–9) అనే దశకంలో భగవంతుడు అళ్వార్లకు తన అనుభవాన్ని సాత్మకృ సాత్మికృ అనుగ్రహిస్తున్నట్టుగా తమ వ్యాఖ్యానావతారికలో శ్రీకృష్ణ సూరి అనుగ్రహించారు దానిని అనుసరించియే దేశికులు, ద్రవిడోపనిషత్ తాత్పర్య రత్నావళిలో" విభు రనుబుభుజే సాత్మ్య భోగప్రదానాత్" అని అనుగ్రహించారు. ఈ ప్రయోగాన్ని ఇక్కడ కూడా ప్రయోగించారు.

ఈ విధంగా గమనించి చూసినప్పుడు ఈ ఇద్దరి మహాచార్యుల ఐకకంఠ్యం ఎంత గాఢమైనదో స్పష్టం అవుతున్నది.

వేరొక వ్యాసంలో ఈ ఇద్దరి మహనీయుల ఐకమత్యాన్ని వేరొక గ్రంథంనుండి గమనిద్దాం. స్వస్తి.

★★★★★

# వ్యాసమహర్షి – వైష్ణవమ్

(శ్రీవైష్ణవ రత్నమాల అనే గ్రంథంలో "తర్కార్ణవ ఉత్తమూర్ వీరరాఘవచార్య స్వామివారు" అనుగ్రహించిన ద్రావిడ వ్యాసానికి అనువాదం)

★★★

**శ్రీమన్నద్రిం స్వయ మధివసన్ వేంకటం వందమానం**
**విశ్వం విశ్వం ఫల మనుపదం లంభయన్ భ్రాజసే త్వమ్,**
**ప్రాప్తాన్ సర్వాన్ సపది భవతః పారమార్థ్యావబోధం**
**ప్రాప్తాన్ కుర్వన్ జయ జయ కలేః క్రౌర్య మేతద్వ్యపోహ్య.**

★★★

ఆస్తిక్యం అనే మాట లోకంలో అంతటా వ్యాపించి ఉన్నది. నాస్తిక వాదాలు అనేకం గ్రంథాలలో కనబడుతున్నాయి. అయితే, "నాస్తికుడు ఇతడు" అని ఒకనిని పూర్తి నాస్తికునిగా చెప్పడానికి వీలు లేకుండా ఉన్నది. సుఖదుఃఖాలకు స్థానమైన ఈ శరీరాన్ని విడచిపెట్టి, సుఖమయమైన జీవనాన్నే ఈ ఆత్మ పొందాలి – అని ఇంచుమించుగా అందరూ భావిస్తున్నారు. అయితే, దానికి తగిన మార్గం ఏమి? అనే దానిని విచారించకుండా, తమకు తోచినట్లుగా చేస్తూ వస్తున్నారు. ఆ ఉజ్జీవనం మన ప్రయత్నం వల్ల మాత్రం పొందడం సాధ్యమైనదా? లేక, దానికి దైవానుగ్రహం ఆవశ్యకమా? అనే విషయాన్ని మొదట స్పష్టంగా తెలుసుకోవాలి. దైవం అనేది ఒకటేనా? అనేకులు ఉన్నారా? అనేకులు ఉంటే, ఏ దైవాన్ని అన్వేషించి నిత్యమైన జీవనాన్ని పొందాలి? అని ఈ విధంగా ఉండే పరామర్శలు ఆవశ్యకం అవుతున్నాయి. ఇటువంటి విషయాలు అన్నీ యుక్తులతో స్థాపింపబడవు. వాటిని తెలిసినవారు చెప్పగా విని గ్రహించాలి, అంతే. ఆ విధంగా ఉపదేశించేవారికి ఆ జ్ఞానం ఏ విధంగా ఏర్పడింది? అనేది కూడా దీనికోసం

విచారించవలసి ఉంటుంది. ఇందువల్ల, అనాదికాలంగా ప్రజలు జన్మిస్తూ ఉన్నట్లే, అనాదికాలంగా ఏ ఉపదేశ పరంపర రూపు మారకుండా అనువర్తిస్తూ వస్తున్నదో, దానిని మూలాధారంగా గ్రహించి తెలుసుకోవడాన్ని విడిచిపెట్టి, అనంతర కాలానికి సంబంధించిన పలు మత వాదాలను ఆదరించి, ప్రాచీనమైన ఉపదేశాలను నిరాదరించడం తగదు – అని ఏర్పడుతున్నది. ఆ ప్రాచీనమైన ఉపదేశాలే వేదాలు అని అనబడుతున్నాయి.

ఆ వేదాలలోని అర్థాన్ని చక్కగా తెలుసుకోవడానికి మహర్షులే సమర్థులు. ఎందుకంటే, వారు తపస్సు చేసి వేదాలను పూర్తిగా దర్శించినవారు. సాధారణంగా ఎవరు ఏమి పలికినా, ఆ విస్తృతమైన మాటలలో అయితే, ఒకదానితో ఇంకొకటి పొసగకుండా, విరుద్ధంగా ఉండే సందర్భాలు కొన్నిచోట్ల కనిపిస్తాయి. సులభంగా అర్థం తెలుసుకోవడానికి వీలైనవి అయినప్పటికీ, పలు అర్థాలు కలిగినవై ఉండే సంస్కృత భాషాపద సందర్భాలలో పలుచోట్ల ఈ స్థితిని గమనించవచ్చు. ఇటువంటి సందర్భాలలో అర్థాన్ని స్పష్టంగా అర్థం గ్రహించడంకోసం మనం యుక్తులను సహాయంగా చేసుకోవలసి ఉంటుంది. అంతమాత్రంతో, వేదాలను విడిచిపెట్టి, కేవలం యుక్తులతో దేనిని సాధించడం తగదు. యుక్తులను పూర్తిగా విడచిపెట్టి వేదాలకు అర్థాలను చెప్పడం కూడా సాధ్యం కాదు. మహర్షులలో ఈ సామర్థ్యం కలిగినవారు ఎవరు? అని విచారించినప్పుడు, మహర్షులు అందరూ వేదాలను దర్శించినవారే అయినప్పటికీ, పూర్తిగా వేదాలను, ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం మొదలైన వేదాలుగాను వాటిలో అంతర్విభాగాలుగాను పలు శాఖలుగా విభజించి, వాటి అధికారులకు వారి వారి శక్తికి తగినట్లుగా ఉపదేశించి, ఈ కలికాలంలో కూడా అవి చెడకుండా ఉండేటట్లు రక్షించిన మహనీయుడైన వేదవ్యాసుడే చాలా గొప్పవాడు – అని అనడంలో ఏ సందేహం లేదు. ఒక్కొక్క కలియుగం ఆరంభంలో వేదాలను

ఈ విధంగా ఒక్కొక్క మహర్షి విభాగం చేసి, ఉపకారం చేస్తున్నాడు – అని పురాణాలు చెబుతున్నాయి.

ఇప్పుడు మనకు సహాయం చేసిన వేదవ్యాసుడు కృష్ణద్వైపాయనుడు అని, బాదరాయణుడు అని జన్మనుండి పిలువబడే పరాశరమహర్షి కుమారుడే. వేదాలను విభాగం చేసి ఉపదేశించిన సామర్థ్యం చేత వ్యాసుడు వేద వ్యాసుడు అని బిరుదును పొందాడు. ఇంత మాత్రంతో నిలువకుండా, తత్వ జ్ఞానానికి సహాయమైన 18 పురాణాలను కూడా అనుగ్రహించాడు. గొప్ప ఇతిహాసం అయిన మహాభారతాన్ని రచించాడు. మహాభారతం అనే ఒక్క గ్రంథాన్నిబట్టే ఈ వేదవ్యాసుడు సాక్షాత్తు నారాయణుడే అని తెలియవచ్చు – అని పరాశరులు

**"కృష్ణ ద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుమ్,**
**కో హ్యన్యో భువి మైత్రేయ! మహాభారతకృద్భవేత్?"**

(కృష్ణద్వైపాయనుడు అనే పేరు కలిగిన వ్యాసమహర్షిని, ఓ మైత్రేయా! సాక్షాత్తు శ్రీమన్నారాయణనిగానే తెలుసుకో. లేకపోతే, వేరొకడు ఎవడు మహాభారతాన్ని రచించగలడు?) అని అనడాన్ని గమనించవచ్చు.

దీనితో వేదాల చివరి భాగాలైన ఉపనిషత్తులలోని తత్వహిత పురుషార్థాలను తెలుసుకోవలసి ఉన్నది కనుక, అక్కడ ఏర్పడే సందేహాలను తీర్చి యథార్థాన్ని మనం తెలుసుకోవడంలో సహాయపడే ఉత్తర మీమాంస అని చెప్పబడే శారీరక బ్రహ్మసూత్రాలను వ్యాసమహర్షి అనుగ్రహించాడు. దీని గొప్పతనం ఎటువంటిది? అనే విషయాన్ని గూర్చి "బ్రహ్మసూత్ర పదై శ్చైవ హేతుమద్భిః వినిశ్చితైః" అని గీతలోకూడా కీర్తింపబడింది – అని భగవద్రామానుల అభిప్రాయం. ఇందువల్లనే "మునీనా మప్యహం వ్యాసః" (మునులలో నేను వేదవ్యాసమహర్షిని) అని శ్రీకృష్ణుడు కూడా గొప్పగా చెప్పాడు. దీనినిబట్టి ఈ మహర్షికి తత్త్వసాక్షాత్కార శక్తితో పాటు విచారించి, తత్త్వనిర్ణయాన్ని చేసే సామర్థ్యంకూడా చాలా గొప్పది – అని చెప్పకుండానే

తెలుస్తున్నది. అందువల్ల, మిగిలిన మహర్షుల కంటే ఈ మహర్షికి ప్రామాణికమైన రీతిలోని జ్ఞానాన్ని విచారణ చేయడంలో సామర్థ్యం చాలా గొప్పదై ఉన్నందువల్ల, ఈ మహర్షి చేసిన నిర్ణయం మనవంటివారు అనుసరించడం మన హితానికి కారణం అవుతుంది – అని ఏర్పడుతున్నది. ఇతడు మహాభారతాదులైన మిగిలిన గ్రంథాలతో చేసిన సహాయం చాలదు అని, శ్రీభాగవతాన్ని రచించి మహోపకారంచేసిన విషయాన్ని చూసినప్పుడు, ఈ మహర్షికి గల వైష్ణవ ప్రచార దృష్టి ఎంత గొప్పదో చాలా స్పష్టం అవుతున్నది.

ఇంతే కాకుండా, ఈ మహర్షి పురాణ ఇతిహాస బ్రహ్మసూత్రాలను రచించేటప్పుడు అందరు మహర్షుల అభిప్రాయాలను ఇతడు చక్కగా గ్రహించాడు –అని స్పష్టమవుతుంది. మహర్షులు అందరూ చేసిన విచారణలను అన్నిటిని ప్రస్తావించి, వాటిని పరిశీలించి, తారతమ్య పరీక్ష చేసి, తన సూక్ష్మమైన జ్ఞానంతో ఋజువుగా విచారించి చేసిన నిర్ణయానికి మించిన నిర్ణయాన్ని చేయడానికి ఇంక ఎవరికీ సామర్థ్యం లేదు.

పురాణాల కంటే ఇతిహాసం గొప్పది. తత్త్వవిచారంలో ప్రవేశించి, పురాణాలను విచారించి చూసినప్పుడు, వాటిలో పరస్పర విరోధం కనిపించడాన్ని ఏ విధంగా తీర్చుకోవాలి? అనే ప్రశ్న వస్తుంది –అని గ్రహించిన ఈ మహర్షి, బ్రహ్మదేవుడు అనుగ్రహించిన పురాణాలు పలు విధాలుగా ఉన్నందువల్ల, వాటిలో ఆ విధంగా పదాలు ఏర్పడి ఉన్నాయి. అందుచేత, సాత్వికం, రాజసం, తామసం, సంకీర్ణం అనే విభాగాలు వీటిలో ఉన్నాయి. మిగిలిన వాటిని విడచిపెట్టి, సాత్విక పురాణాన్నే మోక్షం పొందడంకోసం తత్వ జ్ఞానాన్ని పొందాలని కోరేవారు ఆదరించాలి. సాత్విక పురాణాలే మోక్షాన్ని కలిగిస్తాయి. విష్ణువుయొక్క గొప్పతనాన్ని యథాతథంగా తెలిపే తత్వజ్ఞానం లేకుండా మోక్షాన్ని పొందడం సాధ్యం కాదు. కనుక, దానిని

వివరించే సాత్త్విక పురాణాలే గొప్పవి – అని విభాగం చేసి ఉపదేశించాడు, ఈ మహర్షి. సాత్త్విక రాజసతామసాలు అనే విభాగాన్ని కలిగిన వస్తువులలో, సాత్త్వికమే ఆదరించదగినది – అనేది ఆయా గుణాల స్వభావాన్ని తెలిసినవారు అందరూ అంగీకరించిన విషయమే. విష్ణువును గొప్పగా చెప్పే సాత్త్విక పురాణం అనేదానిని మనం తెలిసికొన్న తరువాత, మిగిలిన పురాణాలలో పరస్పర విరోధంగా ఉండే భాగాలను ఆయా దేవతల యొక్క కీర్తి కోసం ఆరోపించి చేయబడిన స్తోత్రాలు – అని తెలుసుకోవాలి. వాటిలో కూడా, విష్ణుపారమ్యం గోచరిస్తుంది. ఈ విషయం అటు ఉండనివ్వండి.

ఇతిహాసమైన మహాభారతంలో వేదవ్యాసుడు దేనిని పరతత్త్వం అని స్పష్టంగా తెలియజేశాడు? –అని చూసినప్పుడు, ఆ మహర్షి, మిగిలిన పలువురు మహర్షులు సూక్తులుగా చెప్పినవాటిని తన అభిప్రాయంగా గ్రహించకపోయినప్పటికీ, నేరుగా అతడే పలికిన సందర్భాలనే గ్రహించి, తెలిసికోవడం తగినది.

"నారాయణం నమస్కృత్య" అని ఆరంభాన్ని, "వ్యాసప్రసాదాద్ వక్ష్యామి నారాయణ కథామిమామ్"

అనే వాక్యం మొదలైనవానిని ఒక్కొక్క పర్వంనుండి పలు వాక్యాలను మనం గుర్తించి గమనించవచ్చు. అయినప్పటికీ మోక్షధర్మంలోని కొన్ని సందర్భాలు, ఇంకా కొన్ని అంశాలు ఇక్కడ ప్రస్తావించబడతాయి.

శాంతిపర్వం, మోక్ష ధర్మ ప్రకరణంలో యజ్ఞగ్రహారాధ్యాయంలో వైశంపాయనమహర్షి ఈ విధంగా చెబుతున్నాడు.

"సుమంతుడు మొదలైన మేము ఐదుగురు శిష్యులం అధ్యయనం చేసేటప్పుడు, మా సందేహాన్ని తీర్చడం కోసం వేదవ్యాసులు ఈ విధంగా చెప్పాడు. మూడు కాలాలలోని సమస్త వస్తువులనుగూర్చి తెలియగోరి పాల సముద్రం దగ్గర నేను గొప్ప తపస్సు చేసి, నారాయణుని అనుగ్రహంచేత దర్శించినది ఏమి? అంటే, అనిరుద్ధుడుగా ఆవిర్భవించిన మహా పురుషుడైన

ఆ పరమాత్మ చేత సృష్టింపబడిన బ్రహ్మ, వేద ప్రచారం చేసేవాడై, మరీచి మొదలైన ప్రజాపతులను, ఏకాదశరుద్రులను సృష్టించిన తరువాత, వారు అతనిని తమకు అధికారాన్ని ఇవ్వాలని కోరగా. అప్పుడు ఆ బ్రహ్మ "నాకు కూడా దీనిని గూర్చిన ఆలోచనయే. మనం అందరూ కలసి పాల సముద్రంలో ఉండే భగవంతుని ఉద్దేశించి తపస్సు చేద్దాం" అని చెప్పి బయలుదేరి వెళ్ళాడు. భగవంతుడు కూడా "మీరు వైష్ణవక్రతువును చేసినట్లయితే, అందులో మీరు సమర్పించే భాగాలకు తగినట్లుగా వేదంలో కామ్యకర్మలను అన్నిటిని మీ ఆరాధనకు ఏర్పరుస్తాను" అని అన్నాడు. విధంగానే దేవతలు అందరూ వైష్ణవక్రతువును నిర్వహించిన తరువాత, భగవానుడైన విష్ణువు వారు వారు సమర్పించిన దానికి తగినట్లుగా కామ్యకర్మలను వేదాలలో ఏర్పరచి,

**"యాః క్రియాః ప్రచరిష్యంతి ప్రవృత్తిఫలసత్కృతాః,**
**తాభి రాప్యాయితఫలాః లోకాన్ వై ధారయిష్యథ"**

అని అంటూ వాటితో బ్రహ్మ రుద్రాది దేవతలు ఆరాధింపబడవచ్చు –అని అన్నాడు. తరువాత,

**"ఏతే యోగవిదో ముఖ్యాః సాంఖ్యశాస్త్ర విశారదాః,**
**ఆచార్యాః ధర్మశాస్త్రేషు మోక్ష ధర్మ ప్రవర్తకాః"**

అని, నివృత్తి ధర్మం అనే మోక్ష ధర్మానికి ప్రవర్తకులుగా సనకాదులను తెలిపి,

**"సో ऽ హం క్రియావతాం బంధాః పునరావృత్తిదుర్లభాః"**

అని నివృత్తి ధర్మాలుగా చేయబడేటప్పుడు, ధర్మశాస్త్రాలలో ఉండే అన్ని క్రియలకు తనను ఆరాధ్య దేవతగా నారాయణుడు తెలిపాడు. ఆ తరువాత, "లోకగురువైన ఈ బ్రహ్మ నా ఆజ్ఞను అనుసరించి సమస్త ప్రాణులకు వరాలను ఇస్తాడు. నా లలాటంనుండి ఇతనికి తరువాత జన్మించినవాడైన రుద్రుడు ఈ బ్రహ్మ ఆజ్ఞకు లోబడి ప్రాణులను ధరిస్తాడు.

మీరు అందరూ ప్రవృత్తి ధర్మాలతో ఆరాధింపబడి, మీ అధికారాలను నిర్వహిస్తూ, లోకాలను నిర్వహించండి" అని ఈ విధంగా దేవతలకు ఉపదేశించి పలికి, తన హయగ్రీవరూప రూపాన్ని బ్రహ్మ దర్శించేటట్లు చేసి అంతర్ధానం అయ్యాడు– అని ఈ విధంగా ఉపదేశించిన వేదవ్యాసుడు, ఆ తరువాత "ఈ కారణం వల్ల పద్మనాభుడైన భగవానుడే యజ్ఞాగ్రహారాధ్యుడు, అందరి చేత ఆరాధింపబడవలసినవాడు. నివృత్తి ధర్మాలు అన్నీ అతనిని ఉద్దేశించి అనుష్ఠింపబడతాయి. అతడే దేవుడు. అతడే గతి.

**"క్రియతాం మద్వచః శిష్యాః సేవ్యతాం హరిరీశ్వరః,**
**గీయతాం వేదశబ్దైశ్చ పూజ్యతాం చ యథావిధి ",**

అని చివరిగా పలికాడు – అని అన్నాడు. ఈ విధంగా ఇక్కడ చివరి శ్లోకంలో, ఏ వేదశబ్దం అయినా ఆ భగవంతుని చెబుతున్నది, కనుక, బ్రహ్మ రుద్ర ఇంద్రాది శబ్దాలను పురస్కరించుకుని అతనిని పూజించడమే విధి ప్రకారం అనుష్ఠానం అవుతుంది –అని అతడు తన వచనాలను ముగించడం కూడా గమనించదగినది. అతని శిష్యులందరూ, కుమారుడైన శుకుడు " ఈ విధంగా వేదవ్యాసుని ఉపదేశాన్ని పొందాము కదా" అని సంతోషించారు – అని వైశంపాయనుడు తన వచనాలను ముగించాడు.

## 348 వ అధ్యాయంలో వైశంపాయనుడు

**"యో హ్యస్మాకం గురుశ్రేష్ఠః కృష్ణద్వైపాయనో మునిః,**
**జగౌ పర మహం జప్యం నారాయణ ముదీరయన్,**
**గత్వాంతరిక్షాత్ సతతం క్షీరోధ మమృతాశయమ్, పూజాయిత్వా**
**చ దేవేశం పున రాయాత్ స్వ మాశ్రమమ్"**

అని అంటూ పాలసముద్రం దగ్గరకు వెళ్లి, భగవంతుని పూజించి వేదవ్యాసుడు వచ్చేవాడు – అని అతని సామర్థ్యాన్ని తెలియజేశాడు.

ఇక, స్పష్టంగా వ్యాసుడు తన కుమారుడైన శుకునకు చేసిన ఉపదేశాన్ని గమనించాలి. 238 వ అధ్యాయంలో–

"బ్రహ్మేతి చాపి విఖ్యాతం యద్వై పశ్యంతి సూరయః, బ్రహ్మతేజోమయం భూతం భూతకారణమచ్యుతమ్"

అని "నిత్యసూరుల చేత ఎల్లప్పుడూ దర్శింపబడే బ్రహ్మం సృష్టి ఆరంభంలో ఉన్నది" అని చెప్పి, దాని నుండి ఏర్పడిన ప్రకృతి యొక్క విభాగాలు తెలిపేటప్పుడు "మాయాం వైష్ణవీం ప్రకృతిం విదుః" అని దానిని విష్ణువునకు సంబంధించినదిగా వర్ణించాడు.

## "దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా"

అనేది భగవద్గీతా వచనం. దీనివల్ల పరబ్రహ్మం, విష్ణువు ఒకటే అని స్పష్టమవుతున్నది. ఈ పరమాత్మ ముందుగా మూడు కార్యాలను చేస్తున్నాడు – అని బ్రహ్మ విష్ణు పైన తెలిపే సందర్భంలో "పాతి నారాయణో ఽ వ్యయః" అని విష్ణువు, శివుడు అనే పదాలకు ప్రతిగా నారాయణుడు అనే పదాన్ని ప్రయోగించడం, ముందుగానే "నారాయణునకు సంబంధించినది ప్రకృతి" అని చెప్పే చోట "విష్ణువుయొక్క ప్రకృతి" అనే పదాన్ని ప్రయోగించడం అనే వీనిని నిశితంగా గమనించి చూసినప్పుడు, విష్ణువు బ్రహ్మరుద్రుల వలె జీవుడు కాడు, నారాయణుడే అనే అర్థం ఈ మహర్షి అభిప్రాయం – అని తెలుస్తున్నది. దీనివల్ల "మాయినం తు మహేశ్వరమ్" అనే శ్వేతాశ్వతారోపనిషత్ వాక్యంలో చెప్పబడిన "మాయినమ్" అయిన మహేశ్వరుడు విష్ణువే అనేది కూడా స్పష్టం అవుతున్నది.

రుద్రుని ఆరాధించి శుకుడు అనే కుమారుని పొందిన వేదవ్యాసుడు ఆ అరుదైన కుమారుని ఉద్దేశించి "హరియే పరతత్వం " అని ఉపదేశించడం, దాని ప్రకారంగానే శుకుడు యోగం చేసి, పరమాత్మ సాక్షాత్కారాన్ని పొంది, కైలాస పర్వతంలో ఉండే సూర్యమండలాన్ని చూసి, పైకి వెళ్లడం, అప్పుడు పుత్రవియోగం వల్ల బాధపడిన వేదవ్యాసునకు రుద్రుడు ఆశ్వాసాన్ని కలిగించి, ఛాయాశుకుని సృష్టించి ఇచ్చి, అతనితో తృప్తిని పొందమని చెప్పడం – అని ఈ విషయాలను తెలిపే 340, 341 అధ్యాయాలను వీటిని అన్నిటిని గమనించి చూసినప్పుడు, వ్యాసుడు శివద్వేషి కాడు, అయినప్పటికీ, " పరదేవత విష్ణువే. విష్ణువే నివృత్తి ధర్మాల చేత ఆరాధింపబడ వలసినవాడు – అనే నిర్ణయాన్ని కలిగినవాడు – అనేది స్పష్టం అవుతున్నది.

## "మహర్షే! కీర్తనాత్తస్య భీష్మః ప్రాంజలి రబ్రవీత్"

అని భీష్ముడు వేద వ్యాసుని తిరునామాన్ని ఎవరైనా చెబితే విన్నప్పుడు, అంజలిని చేసి గౌరవించేవాడు– అని చెప్పబడింది.

అటువంటి భీష్ముడు, "వ్యాసేన దేవశ్రవస నారథౌ మహర్షిణౌ" (46) అనే విధంగా లెక్కలేనంతమంది మహర్షులు కనిపించేటప్పుడు, " శ్రీకృష్ణునకు మించిన దేవత లేదు" అని నిర్ణయించి చెప్పిన స్తవరాజాన్ని చూచినప్పుడు, అక్కడ,

"నారాయణ పరం బ్రహ్మ నారాయణ పరంతపః, నారాయణ పరం సత్యం నారాయణ పరం పరమ్"

అనే విధంగా తత్వహిత పురుషార్థాలు అన్నీ నారాయణునే పరంగా కలిగినవి –అనేది సర్వమహర్షి సమ్మతమని తెలియజేసే ఉపదేశంగా వ్యాసుని చేత వ్యక్తం చేయబడిన విష్ణుసహస్రనామం, కృష్ణ భగవానుని ఉపదేశంగా వ్యక్తం చేయబడిన భగవద్గీతయే చాలు, విష్ణువుయొక్క పరత్వాన్ని స్థాపించడంలోనే వ్యాసుని దృష్టి –అనేది చక్కగా తెలియజేయడానికి.

ఆది శంకరులుకూడా విష్ణు సహస్రనామ భాష్యంలో, హరివంశంలో కైలాస యాత్రను తెలిపే ఘట్టంలో ఉండే, పరమశివుడు చేసిన ఒక ఉపదేశాన్ని ప్రస్తావించి తెలిపారు.

"హరిరేకః సదా ధ్యేయో భవద్భిః సత్వ సంస్థితైః, ఉపాస్యో –యం సదా విప్రాః! ఉపాయోస్మి హరేః స్మృతౌ"

**అనేది ఆ ఉపదేశం.**

పరమశివుని వద్ద ప్రార్థన చేస్తే, అతడు మోక్షాన్ని అనుగ్రహించడు. మరి ఏమి చేస్తాడు? అంటే, "మోక్షాన్ని అనుగ్రహించే విష్ణువును ఉపాసించే మోక్షాన్ని పొందాలి – అని విష్ణు తత్వాన్ని ఉపాసించే దారిని అతడు ఉపదేశించడంలో సమర్థుడు –అనేది ఈ సూక్తిలోని అర్థం.

త్రిమూర్తులకు ఐక్యంగాని, సామ్యం కాని తత్వం అయినట్లయితే, ఈ విధంగా చెప్పడం పొసగుతుందా! అందుచేత, ఆ మూడు మూర్తులకు భేదమే ఉన్నది. అల్పప్రయోజనాలను ఆశించి, సంసారి స్థితిని కాదని అనుకొనని ప్రాకృతుల విషయంలో – ఆ మూర్తులకు మధ్య ఉండే తారతమ్యాన్ని గమనించి, ఒక మూర్తిని అవమానం చేయడం తగదు – అని చెప్పడం కోసంగా కొన్ని కొన్ని సందర్భాలలో ముగ్గురికి అభేదం, సామ్యం చెప్పబడుతుంది. ఒక్కొక్క వస్తువుయొక్క సృష్టి, స్థితి సంహారాలలో ఏ తేడా లేకుండా, ఈ ముగ్గురు సంబంధాన్ని కలిగి ఉండేవారే. ఈ విషయం అటు ఉండనివ్వండి.

భీష్ముడు, ధర్మపుత్రునకు (206) నారాయణుని పరత్వాన్ని చెప్పాలని ఆరంభించి, "నారద వ్యాస అసిత దేవల వాల్మీకి మార్కండేయాది మహర్షుల వద్ద నేను శ్రవణం చేసినదానిని చెబుతున్నాను" అని ఆరంభించి, "

సర్వ జగత్తుకు కారణమై, లోకాలను రక్షించడం కోసం గొప్ప గొప్ప అవతారాలను ఎన్నిటినో ఎత్తినవాడు –అని కీర్తించి, చివరిలో,

**అంగాని చతురో వేదాః మీమాంసా న్యాయవిస్తరః,**
**ఇతిహాస పురాణాని ధర్మాః స్వాయంభువాదయః,**
**య ఏవ ప్రతివర్తంతే వేదాంతాని చ సర్వశః,**
**భక్తి హీనాః నతై ర్యాంతి నిత్యయోగం కథంచన,**

––––––

"తస్మాత్ బుద్ధ స్త్వమేవైనం ధ్యాహి నిత్య మతంద్రితః, దేహవానివహో విష్ణు రసౌ మాయామయో హరిః"

అని "శ్రీకృష్ణుడే వేద వేదాంత వేదాంగ స్మృతీతిహాస పురాణాదులైన అన్ని శాస్త్రాలకు విషయమై ఉండేవాడు. భక్తి లేనివారు వాటినుండి ఈ విషయాన్ని తెలియజేయలేరు. భక్తితో, శ్రద్ధతో సోమరితనం లేకుండా విచారించి తెలుసుకొనేవానికి ఈ జ్ఞానం కలుగుతుంది – అని అంటున్నావు. ఈ విషయం వేదవ్యాసుని దగ్గర నుండి తనకు తెలియడానికి సాధ్యమైనది" అని అన్నాడు.

ఈ భీష్ముడే ధర్మపుత్రుడు మోక్షాన్ని పొందాలని కోరేవారు మరణ కాలంలో ఏమి ధ్యానించాలి అని ప్రశ్నించినప్పుడు 20010 నారాయణుడు నారదామహర్షికి చేసిన ఉపదేశాన్ని ఉపదేశించేవాడై వాసుదేవ ద్వాదశాక్షరి మంత్రాన్ని జపించి పరవాసు దేవుడైన నారాయణుని చాలా విరివిగా వర్ణించి,

**"చింతయంతో హరిం నిత్యం బ్రహ్మేశానాదయః ప్రభమ్,**
**నిశ్చయం నాధిగచ్ఛంతి తమస్మి శరణం గతః",**

**"త్వామేవాహం స్మరిష్యామి మరణే పర్యుపస్థితే",**
**" అన్యణో గంతుమిచ్ఛామి తద్విష్ణోః పరమం పదమ్"**

అని ఈ విధంగా బ్రహ్మ రుద్రాధులకు మించినవాడైన విష్ణువునే శరణు పొందాలని చెప్పాడు.

ఇటువంటి భీష్మని ఉపదేశమైన విష్ణుసహస్రనామాధ్యాయాన్ని, భగవద్గీతను తమ మహాభారతానికి గొప్పతనాన్ని కలిగించేవిగా వ్యాసుడు భావించాడు. అందరూ ఆదరంతో పారాయణాన్ని చేసే వీటినుండే సులభంగా తత్వ్యజ్ఞానం కలుగవలసి ఉండగా, వాటిని చదివి వివేకం లేకుండా ఉండేవారిని చూచేటప్పుడు భక్తి లేని వారికి తత్వ్యజ్ఞానం ఎన్నిసార్లు, ఎంతగా అధ్యయనం చేసినా పొందబోరు – అని పూర్వం భీష్ముడు చెప్పినదే వాస్తవంగా ఏర్పడుతున్నది. ఇంతే కాకుండా,

**“ఆలోడ్య సర్వశాస్త్రాణి విచార్య చ పునపునః,**
**ఇదమేకం సునిష్పన్నం ధ్యేయో నారాయణః సదా,**

**సత్యం సత్యం పునః సత్య ముద్ధృత్య భుజముచ్యతే,**
**వేద శాస్త్రాత్ పరం నాస్తి న దైవం కేశవాత్పరమ్”**

**అనే వచనాలనుండి కూడా తెలియవచ్చు.**

“ఉపనిషత్తుల వంటి ప్రమాణాలను పురస్కరించుకొని మనం విచారిద్దాం” అని వారు వారు ప్రయత్నించినప్పటికీ, వారి విచారణలో నిర్ణయంగా పొందదగినది ఏమి? అని అంటే,

“తత్త్వం జిజ్ఞాసమానానాం హేతుభిః సర్వతోముఖైః, తత్వమేకో మహాయోగీ హరిః నారాయణః పరః”

అనే విధంగా నారాయణుడే పరతత్వం అనేదే వ్యాసుడు తెలియజేసినది. ఉపనిషత్తుల విచార రూపంగా ఆవిర్భవించినవే బ్రహ్మ సూత్రాలు.

ఇక్కడ, ఈ సందర్భంలో ఈ విధంగా ప్రశ్న ఏర్పడుతుంది. విష్ణు నారాయణాది శబ్దాలలో ఒక పేరు కూడా బ్రహ్మ సూత్రాలలో ఎక్కడ నిర్దేశింపబడలేదే. ఆ విధంగా ఉండగా, విష్ణువే పరదేవతగా బ్రహ్మసూత్రాల అభిప్రాయం– అని పర్యవసిస్తుందా? అనేదే ఆ ప్రశ్న. దానికి సమాధానం ఏమంటే, బ్రహ్మ రుద్రాదుల నామాలు కూడా బ్రహ్మసూత్రాలలో నిర్దేశింపబడలేదు కనుక, వారిలో ఎవరినైనా పరత్వంగా భావిస్తాము – అని చెప్పడానికికూడా సాధ్యం కాదు కదా. ఇక, పరతత్వమే లేదు – అనేదే అభిప్రాయం అయితే ఇక బ్రహ్మ సూత్రాలే అక్కరలేదు. అందువల్ల, ఏదో ఒక వస్తువును పరతత్వంగా వ్యాసుడు నిర్దేశించాడు. అది "ఇటువంటిది" అని నేరుగా నిశ్చితమైన ఒక పదంతో అతడు ఎందుకు చెప్పలేదు? అని అంటే, చెప్పకుండానే తత్వం ఏదో ప్రస్ఫుటంగా తెలుస్తుంది – అనే అభిప్రాయంతోనే చెప్పలేదు. ఆ వ్యాసభగవానుడు ప్రమాణంగా ప్రస్తావించిన ఉపనిషద్వాక్యాలలో అతడు నిర్ణయించిన అర్థాలను పురస్కరించుకొని చూస్తే, ఏది తత్వంగా ఏర్పడుతుందో, అదే అతని అభిప్రాయం అవుతుంది. లేకపోతే, "బ్రహ్మజిజ్ఞాసా" అనే సమాసంలో చతుర్ముఖుని చెప్పవచ్చు, లేక, అతడే పైన చెప్పిన జన్మానికి కారణమా? అని కూడా అడగవచ్చు. ఇంత పర్యంతంగా విచారించాలని ప్రయత్నించినవారు దీనిని విచారించి నిర్ణయం చేయడానికి శక్తి లేనివారుగా కాబోరు – అనేదే అతని అభిప్రాయం. విపరీతమైన నిర్ణయం రాదు –అనేది ముందు అతడు పలికిన శ్లోకాల వల్ల కూడా తెలియదగినదే. ఇంతే కాకుండా, అతడు రచించిన గ్రంథాలలో మహాభారతం కూడా చేరినదే. దానిని చదివేటప్పుడు, విష్ణువునకు బ్రహ్మ కుమారుడని, ఆ బ్రహ్మకుమారుడు పరమశివుడని, వారు కూడా పారమైన

శక్తిని కలవారని, మిగిలిన దేవతలు కూడా వారికి తక్కువవారే అయినప్పటికీ, వారు అద్భుతమైన శక్తిని కలవారు అని, ఈ విధంగా, అంతా నారాయణుడు, విష్ణువు, కృష్ణుడు అని చెప్పబడే భగవంతుని చేత అనుగ్రహింపబడుతున్నదని మనకు తెలిసేటట్టుగా చేసి చేసి, అతడు రచించినప్పటికీ, "నారాయణుని పరతత్వంగా తెలుసుకోండి" అని అతడు ఉపదేశించినప్పటికీ, మనం బ్రహ్మసూత్రాలలో వేరొక వస్తువును పరతత్వంగా చెప్పడానికి ప్రయత్నించేవారమే అయితే, అది మన అజ్ఞాన దోషం వల్ల ఏర్పడినది అవుతుంది తప్ప, అది వ్యాసుని అభిప్రాయంగానో, బ్రహ్మసూత్రాల తాత్పర్యంగానో కాబోదుకదా. "వేరొకటి అర్థం కాదు. "నారాయణుడే పరతత్వం" అనేది మనకు స్ఫుటంగా తెలుస్తున్నది అని బ్రహ్మసూత్రాలలో సర్వ వ్యాఖ్యానాధికరణం మొదలైన సందర్భాలలో శ్రుతప్రకాశికా అనే శీభాష్య వ్యాఖ్యానంలో చాలా విస్తృతంగా అనుగ్రహింపబడింది. ఇంత పర్యంతంగా విచారణ చేయడానికి సాధ్యం కాకపోయినప్పటికీ, సంగ్రహంగా ఈ క్రింద తెలిపిన రీతిలో సారంగా తెలియవచ్చు.

బ్రహ్మ విచారాన్ని చేయడానికి ఆరంభించి, జగత్తు యొక్క జన్మస్థితి ప్రళయాలకు కారణమే ఉపనిషత్తులలో అధ్యయనం చేయబడే బ్రహ్మం –అని ఉపదేశించినప్పుడు, తైత్తిరీయం ముఖ్యంగా ఆ వ్యాసుని మనసులో మెదిలింది. అందువల్ల, సృష్టికి వేరు కారణం, స్థితికి వేరు కారణం, సంహారానికి వేరు కారణం అక్కరలేదు, అన్నిటికీ కారణం ఒకటే –అని అతడు తెలియజేశాడు. ఆ తైత్తిరీయ వాక్యం ఆనందమయ విద్యా సందర్భంలో ఉన్నది. అది, చతుర్ముఖుని ఆనందానికి కూడా నూరు రెట్లు గొప్పగా ఉండే ఆనందాన్ని కలిగినవానిని పరతత్వంగా చెబుతున్నది. అతడు సూర్యమండలంలోను, మన హృదయాలలోనూ ఉండేవాడు, విజ్ఞానమయులు అనే జీవులందరికీ కంటే గొప్పవాడు – అని చెబుతున్నది.

సూర్య మండలంలో ఉండేవాడు ఎవడు? అనే విషయాన్ని విచారించేటప్పుడు, "యథా కప్యాసం పుండరీకమేవ మక్షిణీ" అని ఎఱ్ఱ తామరవంటి కన్నులు కలిగినవాడైన లక్ష్మీనాథుడే –అని తరువాత తెలియజేశారు. అంతర్యామి బ్రాహ్మణాన్ని అక్కడ ప్రస్తావించారు. ఆ బ్రాహ్మణం నారాయణుని చెబుతున్నది –అనేది సుబాలోపనిషత్ వల్ల చక్కగా ప్రస్ఫుటం అవుతున్నది. సద్విద్య అనే ఘట్టాన్ని విచారించేటప్పుడు, సాంఖ్యశాస్త్రంలో చెప్పిన విధంగా, అచేతనమైన మూల ప్రకృతి ఉపనిషత్తులలో చెప్పబడిన జగత్కారణంగా గ్రహిస్తే ఏమి? అనే ప్రశ్న ఏర్పడగా, దానికి పలు విధాలుగా సమాధానాలను చెప్పేటప్పుడు, గతిసామాన్యాన్ని గమనించి చూడాలి అని అన్నారు. అది ఏమంటే, లోకసృష్టికి కారణాన్ని చెప్పడానికి ప్రస్తావించిన ఉపనిషత్తులలోని వాక్యాలను అన్నిటిని గ్రహించి, ఒక్కొక్క వాక్యంలోనూ చెప్పబడిన విశేషాన్ని గమనించాలి అనేదే. ఆ విధంగా గమనించి సూచినప్పుడు సత్తు బ్రహ్మం ఆత్మ అనే విధంగా ఒక్కొక్క చోట ఒక్కొక్క పేరుతో జగత్కారణం చెప్పబడడం వల్ల, బ్రహ్మం తప్ప వేరు సత్తు ఏది కారణం కాదు, ఆత్మగా కాదగినది కాదు, వేరు కారణం ఏదీ లేదు – అని ఏర్పడుతుంది. ఈ విధంగా చివరిగా, " ఏకో హ వై నారాయణ ఆసీత్, న బ్రహ్మ నేశానః "అనే కారణ వాక్యాన్ని గమనిస్తే, బ్రహ్మ రుద్రాదులు కారణం కారు, నారాయణుడే జగత్కారణం – అనేది చాలా సులభంగా ప్రకాశిస్తుంది – అని చెప్పినట్లయినది. ఇంత పర్యంతంగా కూడా ఒకడు పరామర్శించి నిర్ణయం చేయలేకపోయాడు – అని అంటే, అతడు ఉపనిషత్తులను పురస్కరించుకొని బ్రహ్మ విచారం చేయగలిగిన అధికారి కాడు – అనేదే వ్యాసమహర్షి అభిప్రాయం.

మరొక విషయాన్ని కూడా వినండి. వ్యాసుడు పలు ఉపనిషత్తులను విచారించినవాడు. కాని, పురుష సూక్తం ఎవరిని చెబుతున్నది? అనే విషయాన్ని మాత్రం విచారించలేదు. అంత మాత్రమే కాదు,

జ్యోతిరధికరణంలో ఒక వాక్యాన్ని విచారించేటప్పుడు, ఇక్కడ భగవంతుని నాలుగు పాదాలను చెప్పే పురుష సూక్త మంత్రం ఉన్నందువల్ల ఇక్కడ బ్రహ్మమే చెప్పబడి ఉండాలి – అని అన్నాడు. ఈ కారణం వల్ల పురుష సూక్తం పరబ్రహ్మనే చెబుతున్నది –అనే విషయం విచారించనక్కర లేకుండానే తేలిన విషయం అనేది స్పష్టం అవుతున్నది. అందులో ఏ విధమైన సందేహం లేనందు వల్ల, విచారం చేయవలసిన అక్కరలేదు – అని అన్నారు, శ్రుతప్రకాశికాచార్యులవారు కూడా. వేదాలన్నిటిలోనూ అధ్యయనం చేయబడే పురుష సూక్తం నారాయణుని చెబుతున్నది – అనేది సమీపంలో ఉండే "హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ" అనే వాక్యంలో అతనిని లక్ష్మీపతి అని చెప్పినందువల్లనే తెలియబడడంతోపాటు, పలు పలు స్మృతులలో కూడా దానిని విష్ణువిషయం గానే మహర్షులు ఒకే విధంగా, ఏ విధమైన సంశయానికి తావు లేకుండా, ఘోషించడంవల్ల కూడా ఈ విషయం స్పష్టమవుతున్నది. అందుచేత, దానిని ప్రత్యేకంగా నిలిపి, దాని కంటే మిగిలిన ఉపనిషత్తులను పురస్కరించుకునే ఆ విష్ణువు అనే బ్రహ్మాన్ని స్థాపించడంలో వ్యాసుని అభిప్రాయం – అని తెలుస్తున్నది. ఈ విధంగా స్థాపించినవాడు, పురుష సూక్తంలో చెప్పబడిన దేవతను విడిచిపెట్టి, వేరు దేవతను స్థాపించడానికి కారణం ఏది? ఇంతటితో పురుషసూక్త మంత్రాన్నికూడా ప్రస్తావించి చూపించినవాడు కనుక, ఏ విధమైన సంశయానికి ఏ అవకాశం లేదు.

ఇదే కాకుండా, వ్యాసమహర్షివలె, మనం కూడా మనకు లభించిన ఉపనిషత్తులను పురస్కరించుకొని, తత్వనిర్ణయం చేయడానికి ప్రయత్నించాలి. ఆ విధంగా చేస్తేనే, సాంఖ్యాది మతాలలో చెప్పబడిన ప్రకృతి కానీ, జీవుడు కానీ, జగత్కారణం కాదు – అనే విషయం తెలుస్తుంది. ఆకాశం, ప్రాణం, జ్యోతిస్సు, ఇంద్రుడు – అని ఈ విధంగా ఉండే కొన్ని నామాలను పురస్కరించుకొని భ్రమపడి నిర్ణయం చేయకూడదు. అవి

ఒకదానితో ఇంకొకటి విరోధం కలిగినవి అవుతాయి. మిగిలిన ముఖ్య వాక్యాలలో ఇంతకు ముందే తేలినదానినే అవి కూడా చెప్పినవి అవుతాయి. ఈ విధంగా చేసిన నిర్ణయం స్మృతులకు కానీ, వ్యక్తులకు కానీ పొసగకుండా ఉన్నట్లయితే, ఏమి చేయాలి? అని కొందరు భావిస్తారు అది తప్పు. ఇదే పలు స్మృతులకు పొసగినది అవుతుంది. సాంఖ్య స్మృతివంటి కొన్ని స్మృతులకు కోసం పలు స్మృతులను అనాదరించకూడదు. యుక్తులను చూసినా గాని, వారి యుక్తులు మన మతంలో దోషాన్ని చూపించడానికి సమర్థమైనవి కావు. తమ మత స్థాపనంకోసం వారు చెప్పిన యుక్తులు అన్నీ ఆభాస యుక్తులుగా ఉన్నాయి – అని వ్యాసుడు పూర్తి వైదికులు కాని మతస్తులను దూషించడాన్ని ప్రధానంగా గ్రహించాడు. పరిపూర్ణంగా వైదికుడై ఉండేవాడు ఒక్కడు కూడా విష్ణువును పరదేవతగా భావించకుండా, బ్రహ్మ, రుద్రుడు అనే విధంగా ఉండే అన్య దేవతలను పరదేవతగా నిర్ణయించేయడానికి ముందుకు రాబోడు –అనేది ఆ వ్యాసుని అభిప్రాయం.

ఒక దేవతగా చెప్పబడని నిర్గుణబ్రహ్మం అనేదానిని బ్రహ్మసూత్ర ప్రతిపాద్యంగా చెప్పడం చాలా వంచనతో కూడిన విషయం – అనేది ఇక్కడ ఏ విధమైన ప్రసక్తి లేనందువల్ల విచారించి చెప్పనక్కరలేదు. దానిని చెప్పే అద్వైతులు కూడా మొదట సగుణ బ్రహ్మాన్ని ప్రథమపక్షంగా గ్రహించి, విష్ణుపారమ్యాన్ని భావిస్తారు. శివుని పారమ్యానికి కొంచెం కూడా వారు అవకాశం ఇవ్వలేదు అద్వైతులు వైష్ణవులు కాకుండా, ఇంచుమించుగా శైవులుగా మారినట్లుగా తోచడం అంతా ఇటీవలి కాలంలోనే జరిగింది – అనేది గమనిస్తే స్పష్టంగా తెలుస్తుంది. ఇది అంతా కలికాలంలో పాషండుల సహవాసం వల్ల ఏర్పడిన కీడు అని పరాశర మహర్షి స్వయంగా విష్ణు పురాణంలో బాధపడుతూ చెప్పాడు.

**“కలౌ జగత్పతిం విష్ణుం సర్వస్రష్టార మీశ్వరమ్,**
**నార్చయిష్యంతి మైత్రేయ! పాషండోపహతా జనాః”**

అని అన్నాడు కదా. విష్ణువే లోకానికి సృష్టి మొదలైన కార్యాలకు కారణమై, స్వామియై ఉండగా, కలిలో ప్రజలు పాషందులచేత దూషింపబడినవారై, అతని ఆరాధనను విడచి పెడతారు – అని అన్నాడు కదా.

క్షుద్ర ప్రయోజనాలలో మిక్కిలి ఆసక్తిని కలిగినవారై, అన్యదేవతలను ఆశ్రయించి, భగవద్గీతలో చెప్పిన విధంగా లోకం దేవతాంతరాలను పూజించడం సహజం అయినప్పటికీ, తత్త్వజ్ఞానంలో వ్యత్యాసం, తల క్రిందులుగా ఉండే ఆచరణలు తగినవి కాదు. ఇవి కాలక్రమంలో విష్ణుద్వేషంలో పర్యవసించి, ఆసురజన్మకు కారణం అవుతాయి. అంతే కాకుండా, ఇంకా ఇంకా ఇవి వృద్ధి చెంది, పలు విపరీత మతాలు వ్యాపించగా, అందువల్ల కూడా ప్రజలకు ఏర్పడిన పరితాప దశను చూచి దివ్య సూరులు చాలా బాధపడ్డారు. నమ్మాళ్వార్లు తమ తిరువాయ్ మొళి ప్రబంధాన్ని ఆరంభించేటప్పుడు, గుణవిభూతి విగ్రహాలతో విష్ణు పరత్వాన్ని, "అవరవర్ తమ తమ అఱి వఱి వకై వకై" అని అంటూ దేవతాంతరాలయొక్క, వారిని ఆరాధించే ప్రజలయొక్క స్థితిని భావించి, "శుడర్ మికు శురుదియుళ్ ఇవై యుండ శురనే" అని వేద వేదాంత ప్రమాణాలవల్ల విష్ణువే పరతత్వం – అనే విషయం వ్యక్తం అవుతున్నది – అని తెలియజేసి, దీనిని తెలియకుండా బాధపడే స్థితి ఎందుకు? "పిణక్కఱు వఱు వకై చ్చమయముమ్ నెఱియుళ్ళియురైత్త, కణక్కఱు నలత్తనన్" (సంసారం అనే వ్యాధిని తీర్చే రీతిలోని సిద్ధాంతంలో ఉండే విషయాలను అన్నిటినీ ప్రస్తావించి పలికిన, అంతు లేని కళ్యాణ గుణాలను కలిగినవాడు), అతని జ్ఞానాన్ని పురస్కరించుకుని భగవద్గీత, భారతం, పాంచరాత్రం, బ్రహ్మసూత్రాలు మొదలైనవాటి వల్ల ఏర్పడిన మార్గంలో నిలచి, ఉజ్జీవనాన్ని పొందాలి – అని, స్వయంగా ప్రయత్నం చేసి ప్రయత్నం చేసి తెలిసికొన్నప్పటికీ కూడా,

భగవంతుని తత్వాన్ని తెలుసుకోవడం చాలా అరుదు – అని, సమస్త కళ్యాణ గుణ విశిష్టుడైన నారాయణునితో చతుర్ముఖుని, హరుని చేర్చి వ్యర్థంగా విచారాన్ని చేయడాన్ని నిలిపివేసి, లక్ష్మీసంబంధాన్ని కలిగిన పరమాత్మ పాదాలను నమస్కరించాలి –అని మొదటి దశకంలో ఉపదేశించారు. తరువాత, "తిణ్ణన్ వీడు" అనే రెండవ దశకంలో, ఈ విధంగా వేద వేదాంతాలలో ఏ విధమైన వేరుసహాయం అక్కర లేకుండానే లక్ష్మీనాథుని గొప్పతనం తెలుస్తూ ఉండగా, మహర్షుల సూక్తులుకూడా దానికి చక్కగా వివరిస్తూ ఉండగా, భగవంతుడు కూడా మాటిమాటికి అవతరించి తన ఉపదేశాలతోనూ, తన ఆచరణలతోనూ ఆ ధర్మాలను నడుపుతూ ఉండగా, పలు పురాణాలు ఉన్నప్పటికీ, వాల్మీకి అనుగ్రహించిన రామాయణాన్ని, పరాశర మహర్షి అనుగ్రహించిన విష్ణు పురాణాన్ని, వ్యాసుడు అనుగ్రహించిన మహాభారతాన్ని,, అంతటితో తృప్తి పడకుండా, ఆ వ్యాసుడే శ్రీమన్నారాయణుడే పరతత్వమ ని, ఆ స్వామి శ్రీపాదాలలో భక్తి జ్ఞానాలను వృద్ధి చేయడం కోసమే అనుగ్రహించిన భాగవతాన్ని లోకంలో అంతట మహానుభావులు పారాయణ ప్రవచనాలను చేసేవారై ఉండగా, దీని తర్వాత కూడా, లోకం అజ్ఞానాన్ని పొంది, ఆ స్వామిని తెలియకుండా వాదాన్ని చేస్తున్నారే! మనం కూడా దీనికోసం కాలాన్ని వ్యర్థంగా గడుపవలసి వచ్చిందే! అని కలత చెంది, "ఎ పావమ్ పరమే ఏழ்లకుమ్ ఈ పావమ్ శెయ్ దు అరుళాల్ అళిప్పార ఆర్,? మా పావనమ్ విడ అరర్ క్కు పిచ్చై శెయ్ కోపాల కోళరి ఏఱన్నియే" అని అంటూ బాధ పడ్డారు.

దీనివల్ల, చాలా స్పష్టంగా, వ్యాసుడు శ్రీవైష్ణవ శ్రేష్ఠుడు అని, శ్రీవైష్ణవ ప్రచారంకోసమే జన్మించి, పూర్ణంగా కృషి చేశాడు – అనే విషయం కరబదిరికాన్యాయంలో విస్పష్టం అవుతున్నది కదా.



# అడికళ్

భాష చాలా విచిత్రమైనది. అద్భుతమైన శక్తిని కలిగినది. భాషకు కల శక్తిని గమనించి చూచినప్పుడు, ఒక్కొక్కసారి చాలా విస్మయం కలుగుతుంది.

ప్రతి భాషలో పర్యాయపదాలు అని కొన్ని ఉంటాయి. ఇవి ఒకే అర్థాన్ని చెప్పే, భిన్న రూపాలను కలిగిన పదాలు.

ఆ విధంగానే, అనేకార్థక పదాలు కొన్నిశఉంటాయి. ఈ పదాలు, ఒకే అర్థాన్ని కాకుండా, వేరు వేరు అర్థాలను ఇస్తాయి. ఉదాహరణకు, సంస్కృతంలో సైంధవ మనే శబ్దం ఉన్నది. ఈ శబ్దానికి, సైంధవ లవణం అని, గుర్రమని రెండు అర్థాలు ఉన్నాయి. ఈ విధంగా సైంధవం అనే ఒకే పదానికి రెండు వేరు వేరు అర్థాలు నిఘంటువులలో తెలుపబడడాన్ని మనం గమనించవచ్చు. అయితే, ఈ అర్థాలలో, ఏ అర్థం ఎప్పుడు గ్రహించాలి? అనే విషయాన్ని మనం సందర్భాన్ని బట్టి, వ్యక్తిని బట్టి, దేశాన్ని బట్టి నిర్ణయం చేసుకోవలసి ఉంటుంది. ద్వ్యర్థి, త్ర్యర్థి కావ్యాలలో ఇటువంటి పదాల ప్రయోగాన్ని మనం చూడవచ్చు. ఇది అంతా సాధారణమైన విషయమే.

కానీ, ఇంతకంటే విలక్షణమైన పదక్రమం కూడా వేరొకటి ఉన్నది. ఒకే పదం, పరస్పరం విరుద్ధమైన అనేకార్థాలను తెలిపే వైచిత్రికి కూడా భాషకు ఉన్నది. ఉదాహరణకు, సంస్కృతంలో "ఆరాత్" ఒక అవ్యయ పదం ఉన్నది. "ఆరాద్దూర సమీపయోః" అని అమరకోశం, ఈ పదానికి దూరమని, దగ్గర అని కూడా అర్థమని తెలియజేస్తున్నది. ఈ రెండు అర్థాలు ఒకదానికి ఇంకొకటి విరుద్ధమైనది కదా.

ఆళ్వారుల దివ్య ప్రబంధాలలో కూడా అటువంటి పదాల ప్రయోగం మనకు గోచరిస్తుంది. అటువంటి ఒక పదాన్ని ఇప్పుడు గమనిద్దాం.

ద్రావిడభాషలో "అడి" అనే ఒక పదం ఉన్నది. దీనికి – పాదం – అని అర్థం. అయితే, ఇది అనేకార్థక పదం. ఈ పదానికి మూలమని, దెబ్బ అని, కారణమని, ఈ విధంగా అనేక అర్థాలు ఇంకా ఉన్నాయి. ఈ అర్థాలలో కవులు, వ్యవహర్తలు ఈ పదాన్ని ప్రయోగించడం కనబడుతుంది కూడా. అయితే, ఇది విశేషం కాదు. ప్రస్తుత విషయం కూడా కాదు. ఈ విధంగా ఒకే పదానికి అనేకమైన అర్థాలు ఉండడం ప్రతి భాషలోనూ సహజమే కదా. విశేషం ఏమంటే, "అడి" అనే ఈ పదం పరస్పరం వ్యతిరేకమైన రెండు అర్థాలలో దివ్యప్రబంధాలలో ప్రయోగింపబడడాన్ని మనం ఇపుడు చూడవచ్చు.

తమిళ భాషలో, పాదాన్ని తెలిపే ఈ పదం, పాదాలను ఆశ్రయించిన సేవకునికూడా చెబుతుంది. నమ్మాళ్వారుల తిరువాయ్ మొళి దివ్యప్రబంధంలోని మొదటి శతకం, ఐదవ దశకం ఆరంభంలో "పత్తుడై అడియవర్" (భక్తిని కలిగిన దాసులు) అని మొదలైన ప్రయోగాలలో ఈ అర్థాన్ని గమనించవచ్చు. ఈ అర్థం పాదసంబంధాన్ని కలిగినవాడు, పాదాలకు సేవ చేసేవాడు, పాదాల దగ్గర పడి ఉండేవాడు– సేవకుడు కనుక, లక్షణావృత్తి ద్వారా పాదాన్ని చెప్పే ఈ "ఆడి" అనే పదం పాద సంబంధాన్ని కలిగిన సేవకుని చెబుతున్నది. ఈ " ఆడి" అనే పదాన్ని ఆధారంగా చేసుకుని వచ్చిన "అడిమై" అనే పదం "సేవకుడు చేసే వృత్తి– దాస్యం" అనే అర్థంలో, ఆళ్వారుల ప్రబంధాలలో పలుచోట్ల ప్రయోగింపబడడాన్ని చూడవచ్చు.

అయితే, సేవకుడు– అనే అర్థమిచ్చే "అడి" అనే ఈ పదమే, ఈ అర్థానికి పూర్తిగా విరుద్ధమైన "స్వామి" అనే అర్థంలో కూడా ప్రయోగింపబడడానికి గమనించవచ్చు. నమ్మాళ్వారులు తిరువాయ్ మొళి ప్రబంధంలోని మొదటి శతకం మూడవ దశకంలో "తిరువుడై అడిగళ్ తమ్ నలమ్ కళల్ వణంగి" (1–3–8) (లక్ష్మీ సంబంధాన్ని కలిగిన స్వామి యొక్క కళ్యాణ గుణాలను కలిగిన పాదాలకు నమస్కరించి) అంటూ ఈ పదాన్ని

స్వామి అనే అర్థంలో ప్రయోగించారు. తిరుమంగై ఆళ్వారులు కూడా పెరియ తిరుమొళి ప్రబంధంలో (5–2–5) "అండత్తు అమరుమ్ అడికళ్" అని ఈ అర్థంలోనే ఈ పదాన్ని ప్రయోగించడాన్ని చూడవచ్చు.

ఇక్కడ కూడా "అడి" అనే ఈ పదానికి స్వామి అనే అర్థం లక్షణ వల్లనే వచ్చిందని చెప్పాలి. ఇక్కడ, భగవంతుని దివ్య మంగళ విగ్రహంలో ఒక భాగమైన పాదాన్ని తెలిపే "అడి" అనే పదం ఆ దివ్య మంగళ విగ్రహాన్ని లక్షిస్తుంది.

ఈ విధంగా అంగపదంతో అంగిని లక్షించడం అనేది వైదిక క్రమంకూడా. ద్వయమంత్రం, పూర్వవాక్యంలోని భగవంతుని దివ్య చరణాలను తెలిపే "చరణౌ" అనే పదం ద్వారా ఆ భగవానుని దివ్య మంగళ విగ్రహం లక్షింపబడుతున్నదని శ్రీపిళ్లై లోకాచార్యులవారు ముముక్షుప్పడి గ్రంథంలో తెలియజేశారు.

"వేదమ్ తమిழ் శెయ్ ద మాఱన్" (వేదాలను ద్రావిడ భాషలో అనుగ్రహించిన నమ్మాళ్వారులు) అనే సూక్తికి ఇది ఒక చిన్న ఉదాహరణం.

★★★★★

# శుచిశ్రవాః



భగవానుడైన శ్రీమన్నారాయణుని కీర్తించే స్తోత్రాలు ఎన్నో ఉన్నప్పటికీ, ఆ స్తోత్రాలు అన్నిటిలోనూ, పంచమ వేదంగా పరిగణింపబడి శ్రీమహాభారతంలోని, భాగవతాగ్రేసరుడైన భీష్మాచార్యునిచే ఉపదేశింపబడిన ఈ విష్ణు సహస్రనామ స్తోత్రం నిరూపమానమైనది. దీనికి గల ప్రాచుర్యం, మహిమ చాలా గొప్పవి. వైదిక సంప్రదాయాలకు చెందినవారందరూ ఈ స్తోత్రాన్ని ఎటువంటి తేడా లేకుండా ఆదరించడం, తమ తమ సిద్ధాంతాలకు అనుగుణంగా ఈ స్తోత్రానికి వ్యాఖ్యానాలను వెలయించడం అనేవి ఈ స్తోత్ర వైభవాన్ని తెలుపుతున్నవి.

శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత సంప్రదాయాలకు అనుగుణంగా ఈ స్తోత్రానికి శ్రీపరాశరభట్టర్ అనే ఆచార్యవర్యులు "భగవద్గుణ దర్పణం" అనే పేరుతో అద్భుతమైన అనితర సాధారణమైన భాష్యాన్ని అనుగ్రహించారు. ఈ స్తోత్రంలోని నామాలు అన్నీ భగవంతుని స్వరూపరూప గుణ లీలాది విశేషాలను తెలుపుతున్నవి – అని సప్రమాణంగా వారు ఆ భాష్యంలో నిరూపించారు.

ఆ స్తోత్రంలో "శుచిశ్రవాః" అనేది ఒక నామం. నామాల వరుసలో ఇది 119వ నామం. "విశ్వయోనిః" అనేది దీనికి ముందు నామం. భగవానుడు అనంత రూపియై భూమిని ధరిస్తూ, భక్తులందరికి తన సంశ్లేషాన్ని కలిగిస్తాడు –అని ఈ "విశ్వయోనిః" నామం చెబుతున్నది – అని భట్టర్ ఈ నామాన్ని వ్యాఖ్యానించారు.

ఈ సందర్భంగలో పఠింపబడిన "శుచిశ్రవాః" అనే తరువాత నామాన్ని కూడా, ఈ సందర్భానికి అనుగుణంగానే, "భక్తులకు తన సంశ్లేషానికి ఎల్లప్పుడూ కలిగించే భగవానుడు, ఆ భక్తులు భక్తితో పలికిన

శుచి అయిన మాటలను తప్పక వింటాడు, కనుక, "శుచిశ్రవాః" అనబడుతున్నాడు– అని వివరించారు.

దీనికి ప్రమాణంగా భట్టర్ భారతంలో శాంతి పర్వంలోని మోక్ష ధర్మాలలోని ఒక శ్లోకాన్ని ఉదాహరించారు. శ్రీకృష్ణ భగవానుడు స్వయంగా అర్జునునకు తన నామాలను కొన్నిటిని నిర్వచించి చెబుతూ, "శుచిశ్రవాః" అనే నామ తనకెందుకు కలిగిందో తెలిపే సందర్భంలో ఈ శ్లోకం ఉన్నది. శ్లోకం ఈ విధంగా ఉన్నది–

**" శుచీని శ్రావణీయాని శృణోమీహ ధనంజయ! ,**
**న చ పాపాని గృహ్ణామి తతో ఽ హం వై శుచిశ్రవాః"**

దీని భావం ఏమంటే– శుచి అయినవి, వినదగినవి అయిన మాటలను, అర్జునా! నేను వింటాను తప్ప పాపపు మాటలను నేను వినను. అందువల్ల నేను "శుచిశ్రవాః" కనబడుతున్నాను– అని.

అయితే, శుచి అంటే ఏమి? అనే ఆకాంక్ష ఇక్కడ కలుగుతుంది, కనుక, దానిని సమాధానించడం కోసం మళ్లీ భారతం నుండి ఇంకొక ప్రమాణాన్ని భట్టర్ ఇక్కడ "విదురాన్నాని బుభుజే శుచీని గుణవంతి చ" (శుచి అయినది, అందువల్లనే, సాత్విక గుణాన్ని కలిగినది అయిన విదురుడు పెట్టిన అన్నాన్ని శ్రీకృష్ణుడు భుజించాడు) అని ఉదాహరించారు. భక్తుడు భక్తితో సమర్పించిన ద్రవ్యం ఏదైనా, అది శుచియే – అని దీని తాత్పర్యం. ఈ ప్రమాణం శుచిశబ్దాన్ని నిర్వచిస్తున్నది.

ప్రస్తుత నామంలోని "శ్రవాః" రెండవ పదానికి అనుగుణంగా, భట్టర్ ఈ సందర్భంలోనిదే అయిన ఇంకొక, ఈ క్రింది ప్రమాణాన్ని ఉదాహరించారు.

**"ధర్మ్యా రమ్యా శ్చార్థవతీః విచిత్రార్థపదాక్షరాః,**
**శ్రుణ్వతో వివిధా వాచో విదురస్య మహాత్మనః,**
**అకామస్యైవ కృష్ణస్య సా వ్యతీయాయ శర్వరీ"**

(ధర్మంతో కూడినవి మధురమైనవి, అర్థవంతమైనవి, విచిత్రమైనవి అయిన, మహాత్ముడు విదురుడు పలికిన మాటలను వింటూ కృష్ణుడు ఆ రాత్రి అంతటినీ గడిపాడు)

దీనివల్ల భక్తులు భక్తితో పలికిన వచనాలను ఆదరంగా, ప్రీతిగా వింటాడు కనుక, అతడు "శుచిశ్రవాః" అనబడుతున్నాడు – అని ఈ వివరణలోని తాత్పర్యం.

ఈ నామానికి నంబిళ్ళై అనే పూర్వాచార్యులు, తిరువాయ్ మొళి ప్రబంధానికి తాము అనుగ్రహించిన ఈడు వ్యాఖ్యానంలో పరాంకుశ నాయకి శరణాగతి పరంగా గజేంద్రుని శరణాగతి పరంగా, పరంగా, ద్రౌపదీ శరణాగతి సందర్భంగా – మూడు విధాలుగా అన్వయించి వివరించారు.

పరాంకుశనాయకి శరణాగతి ఇక్కడ ప్రస్తుత విషయం. దానికి దృష్టాంతాలుగా గజేంద్ర వృత్తాంతం, ద్రౌపదీ వృత్తాంతం ప్రస్తావించబడ్డాయి. నంబిళ్ళై ఈ మూడు వృత్తాంతాలను ఈ నామానికి వివరణాత్మకాలుగా ఉదాహరించడంలో ఉండే నేపథ్యాన్ని కొంచెం గమనించాలి.

ఈ ప్రస్తావన తిరువాయ్ మొళి ప్రబంధంలోని ఆరవ శతకంలోని "రెండవ దశకం అవతారికలో" ఉన్నది. ఈ దశకానికి ముందు జరిగిన వృత్తాంతం ఇక్కడ ప్రస్తావనార్హం.

పరాంకుశ నాయకి దీనికి ముందు "పిఱంద వాఱుమ్" అనే దశకంలో భగవంతుని ఉద్దేశించి, భగవంతుని సాక్షాత్ అనుభవం తనకు కలుగకపోయినా, అది లభించే వరకు భగవంతుని గుణాలను అనుసంధించి, తాను శరీరం ధరించేటట్లుగా తనను అనుగ్రహించవలసినదిగా శరణాగతి

చేసింది. బ్రహ్మాస్త్రంవంటి శరణాగతివి చేసినప్పటికీ భగవానుడు అనుగ్రహించనందున, ఆర్తిని సహించలేక, "వైకల్ పూమ్ కழிవాయ్" (6–1) ప్రస్తుత దశకానికి ముందు దశకంలో పక్షుల ద్వారా "తిరువణ్ వండూర్" అనే దివ్యక్షేత్రంలో నివసించే భగవంతుని దగ్గరకు ఢౌత్యాన్ని పంపినది. అప్పటికీ భగవానుడు సమాధానం పలుకునందున, పరాంకుశనాయకిలో ప్రణయ రోషం తల ఎత్తినది. ఇక భగవానుడు వచ్చినప్పటికీ కూడా "అతనిని చూడకూడదు, అతనితో మాట్లాడకూడదు" అని తన చెలికత్తెలతో కలసి నిశ్చయించుకున్నది.

అయితే, ఇంతవరకు రాని స్వామి ఇప్పుడు వస్తాడా? భగవానుడు వచ్చే అవకాశం ఉన్నప్పుడు కదా, "అతనిని చూడకూడదు, అతనితో మాటలాడకూడదు" అని నిశ్చయాన్ని చేసుకునే అవకాశం ఉంటుంది– అనే ఒక సందేహాన్ని వ్యాఖ్యానకారులు లేవనెత్తి, ముందుగా, పరాంకుశ నాయకి దశను చూస్తే భగవానుని రాక తప్పదు– అనే ఒక సమాధానాన్ని తెలియజేసి, భగవంతుని స్వభావం చూసినా గాని, అతని రాక నిశ్చయం– అని చెప్పవచ్చు – అని నిరూపించే సందర్భంలో, "శుచిశ్రవాః" అనే ఈ నామ వివరణ ప్రస్తావనను చేయడం జరిగింది.

"భగవానుడు, భక్తులు భక్తితో పలికిన శుచి అయిన మాటలను తప్పక వినే స్వభావాన్ని కలిగినవాడు" అనే అర్థాన్ని "శుచిశ్రవాః" అనే నామం తెలుపుతున్నది కనుక, దానిని ఇక్కడ నంబిళ్ళై ప్రస్తావించారు. పరాంకుశనాయకి అతిశయించిన భక్తితో తన మనస్సులో ఏర్పడిన ఆర్తి వల్ల దూతలను పంపినది కనుక, భగవానుడు, ఆ దూతల ద్వారా నాయకి పంపిన సందేశాన్ని విని, ఆమెను అనుగ్రహించడం కోసం వస్తాడు– అని వివరించే వ్యాఖ్యాత, "భగవానుడు ఇటువంటి స్వభావాన్ని కలిగినవాడు" అనే

విషయాన్ని వివరించే గజేంద్ర శరణాగతి సందర్భాన్ని ద్రౌపదీ శరణాగతి వృత్తాంతాన్ని ఈ నామవివరణకు ఉదాహరణలుగా ప్రస్తావించారు.

గజేంద్రుడు "నాహం కళేబరస్యాస్య త్రాణార్థం మధుసూదన! , కరస్థ కమలాన్యేవ పాదయోరర్పితుం హరే!" (ఓ మధుసూదనా! నేను నా శరీర రక్షణ కోసం నిన్ను వేడడం లేదు. నా కరంలో ఉండే పద్మాలను నీ పాదాలలో అర్పించే భాగ్యాన్ని నాకు కలిగించమని మాత్రమే వేడుతున్నాను) అని భక్తితో, ఆర్తితో పలికిన శరణాగతి వచనాలను ఆదరంగా విని, భగవానుడు చాలా వేగంగా ఆ గజేంద్రుని రక్షించడం కోసం వచ్చిన వైనాన్ని పరాశర భట్టర్ శ్రీరంగరాజస్తవం ఉత్తర శతకంలో "అతంత్రితచమూపతి" అని మొదలవుతున్న శ్లోకంలో అద్భుతంగా వర్ణించి, ఆ శ్లోకం చివరిలో "పతగరాజ మారోహతః భగవతః త్వరాయై నమః" అని అంటూ, గజేంద్రుని రక్షించడం కోసం వచ్చే భగవానుని త్వరకు, సంభ్రమానికి మంగళాశాసనం చేశారు. ఆ సూక్తులను వ్యాఖ్యాత ప్రమాణంగా ఈ సందర్భంగా ప్రస్తావించారు. ఈ విధంగా, ఈ గజేంద్ర శరణాగతి సందర్భం "శుచిశ్రవాః" అనే నామాన్ని వివరిస్తున్నదని వ్యాఖ్యాత నంబిళ్ళై అభిప్రాయం.

ఆ విధంగానే, నిండు సభలో అందరి ముందు తనకు అవమానం జరిగే సందర్భంలో, ద్రౌపది భగవంతుని ఉద్దేశించి భక్తితో, ఆర్తితో, " గోవింద! పుండరీకాక్ష! రక్ష మాం శరణాగతామ్" (గోవిందా! పుండరీకాక్షా! శరణాగతురాలనైన నన్ను నీవు రక్షించు) అని పిలిచిన పిలుపును ఆదరంగా విని, ఆమెకు ఆవశ్యకమైన రక్షణను అనుగ్రహించాడు. అంతే కాదు, ఆమె పలికిన ఆ శరణాగతి వచనాలు శ్రీకృష్ణ భగవానునకు, ఆ స్వామి అవతార సమాప్తిని చేసే వరకు "ఆమె శరణాగతి చేసినప్పుడు తాను ఆమె సమీపానికి వెళ్ళలేకపోయానే" అనే అసంతృప్తి శ్రీకృష్ణ భగవానునకు, అవతార సమాప్తిని చేసే వరకు అతని మనసులో మెదులుతూ ఉన్నవి– అనే విషయాన్ని తెలిపే మహాభారతంలోని " గోవిందేతి యదాక్రందత్ కృష్ణా మాం దూరవాసినమ్,

ఋణం ప్రవృద్ధమివ మే హృదయాన్నాపసర్పతి" (గోవిందా! అని అంటూ ద్రౌపది దూరంలో ఉండే నన్ను ఉద్దేశించి చేసిన ఆక్రందన, వడ్డీతో పెరిగిన అప్పువలె, ఇప్పటికీ నా హృదయం నుండి తొలగిపోవడం లేదు) అనే వచనాన్ని, "నాతిస్వస్థమనా యయౌ" (సంతృప్తి చెందిన హృదయంతో అవతార సమాప్తిని చేయలేదు) అనే వచనాన్ని ఉదాహరించి, ఈ సందర్భంగా కూడా "శుచిశ్రవాః" అనే నామాన్ని వివరిస్తున్నదని నంబిళ్ళై అభిప్రాయపడ్డారు.

ఈ రెండు ఉదాహరణలను ప్రస్తావిస్తు, "శుచిశ్రవాః" భగవన్నామాన్ని వివరించిన నంబిళ్ళై, ఇటువంటి స్వభావాన్ని కలిగిన భగవానుడు, పరాంకుశనాయకి ఆర్తితో పలికిన శరణాగతి వచనాలను విని, ఆమెను అనుగ్రహించడం కోసం తప్పక వస్తాడు– అని నిరూపించారు.

"నామంగళ్ ఆయిరత్తుళ్" (5–9–11) అని అంటూ తిరువాయ్ మొళి ప్రబంధంలో ఉండే పాశురాలు వేయి, భగవంతుని వేయి నామాలు అని స్వయంగా తెలియజేశారు. అటువంటి ఆ పాశురాలలో భగవాను ని నామాల అర్థం అనుసంధింపబడడంలో ఆశ్చర్యం ఏమున్నది?

ఈ విధంగా, మన పూర్వాచార్యులు తమ వ్యాఖ్యానాలలో, గ్రంథాలలో శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రములోని పలు నామాలకు చాలా అందమైన వివరణలను అనుగ్రహించారు. స్వస్తి.

★★★★★

# శ్రీరామాయణంలో భగవదాలయ దర్శన ప్రకారం

★★★★

**శ్రీవాగుక్తిసమాఖ్యదివ్యసుకృతేః వ్యాఖ్యాసు సంద్రృశ్యతే**
**యా శక్తిః వివిధప్రమాణవచనప్రస్తావనే నిస్తులా,**
**శ్రీమద్దేశికపుంగవస్య మహతో నంబిళ్ళైనామ్నః, సదా**
**తస్మై మే శతశో భవేన్నమ ఇదం కార్తజ్ఞ్యభావాంచితమ్.**

★★★★

వేదానికి ప్రతిరూపంగా పురాణాలచేత సంభావింపబడిన శ్రీరామాయణంలో ఎన్నో వేదాంతార్థాలు ప్రకాశించడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. కానీ, వైదికమైన భగవద్రామానుజ సిద్ధాంతానికి సంబంధించిన ఎన్నో సాంప్రదాయికమైన రహస్యాలు కూడా ఇందులోభాసించడం చాలా ఆశ్చర్యకరం. ఈ అంశాలను మన పూర్వాచార్యులు తమ దివ్య ప్రబంధ వ్యాఖ్యానాలలో, స్వతంత్ర గ్రంథాలలో అద్భుతంగా విశదీకరించారు. అటువంటి, ఒక సాంప్రదాయికమైన, అవశ్యం జ్ఞాతవ్యమైన శ్రీరామాయణంలో భాసించే ఒక విశేషాన్ని భావన చేద్దాం.

దీనిని నంబిళ్ళై అనే మహనీయులు నమ్మాళ్వారులు అనుగ్రహించి నాలుగు దివ్యప్రబంధాలలో ప్రధాన ప్రబంధం అయిన, సామవేద సారంగా కీర్తింపబడే తిరువాయ్ మొళి దివ్యప్రబంధానికి తాము అనుగ్రహించిన ఈడు వ్యాఖ్యానంలో తెలియజేశారు. ముందుగా, ఆ దివ్యప్రబంధంలో ఆ అర్థం భాసించే సందర్భాన్ని గమనిద్దాం.

ఈ సందర్భం ఆ ప్రబంధంలో, ఆరవ శతకం, ఒకటవ దశకంలోని "ఒరు వణ్ణమ్ శెన్రు పుక్కు" అనే 7వ పాశురంలో దర్శనమిస్తుంది. ఈ దశకంలో ఆళ్వార్లు పరాంకుశ నాయకీ భావంతో, తిరు వణ్ వండూర్ అనే

దివ్యదేశంలో ఉండే శ్రీరామచంద్రుని దగ్గరకు కోకిలలు, చిలుకలు, తుమ్మెదలు మొదలైన పక్షులను దూతగా పంపుతూ, ఆ స్వామి విషయంలో తమకు కల ఆర్తిని తెలియజేస్తున్నారు. ఈ ఏడవ పాశురంలో చిలుకను దూతగా పంపిస్తూ, ఆ దివ్య దేశానికి వెళ్లి స్వామికి తన ఆర్తిని తెలియజేసి అతడు చెప్పిన సమాధానాన్ని తనకు తెలియజేయమని పరాంకుశ నాయకి అంటున్నది.

తిరువణ్ వండూర్ దివ్యదేశంలో ప్రవేశించినప్పుడు, ఆ దివ్యదేశం భగవానుడు అభిమానించి నివసించే చోటు కనుక, దానిని దర్శించినప్పుడు, అందులో ఉండే భోగ్యత భగవద్భక్తులకు పరమ భోగ్యంగా ఉంటుంది. ఆ భోగ్యత భక్తులను ముందుకు వెళ్ళనీయకుండా అమితంగా ఆకర్షిస్తుంది. దానిని దాటి వెళ్లడం చాలా కష్ట సాధ్యమే అయినా, ఆ క్షేత్రంలోని భోగ్యతలో దృష్టి పెట్టకుండా, ఏదో ఒక విధంగా చూపును మనస్సును నియంత్రించుకుని, ఆ క్షేత్రంలో ఉండే స్వామి దగ్గరకు వెళ్ళమని చెప్పే క్రమంలో, నాయకి చిలుకను ఉద్దేశించి, "ఒరు వణ్ణమ్ శెన్ఱు పుక్కు ఎనక్కు ఒన్ఱురై ఒణ్ కిళియే! " (చిలుకా! ఏదో ఒక విధంగా ఆ క్షేత్రంలోకి చేరి ప్రవేశించి, స్వామిని దర్శించి, తిరిగి వచ్చి నాకు ఒక సమాధానాన్ని చెప్పు) అని అన్నది.

ఇక్కడ, నాయకి పలికిన "ఒరు వణ్ణమ్ శెన్ఱు పుక్కు" అనే మాటలోని స్వారస్యాన్ని వ్యాఖ్యాత నమ్బిళ్ళై వివరిస్తూ, "వழியిలే నెఞ్జై అపహరిక్కుమ్ భోగ్యతైయై అడైత్తు, అతిల్ కాల్ తాழாదే వరుంది ఒరుపడి శెన్ఱు పుక్కు" (దారిలో మనసును అపహరించే ఆ క్షేత్రంలోని భోగ్యతను అతిక్రమించి, అందులో కాలు జారకుండా ఉండేటట్లుగా శ్రమపడి ఏదో ఒక విధంగా దాటి వెళ్లి, ఆ క్షేత్రం లోపలకి ప్రవేశించి) అని వివరించారు.

ఇక్కడ ఈ విధంగా ఆళ్వార్లు పలకడంవల్ల ఒక సాంప్రదాయికమైన విషయం ధ్వనిస్తున్నది. ఇక్కడ పరాంకుశ నాయకి దూతగా పంపించే చిలుక

సామాన్యమైన చిలుక కాదు. ఈ చిలుక ఆచార్యుడే. ఆళ్వారులవంటి పరమ భక్తులు భగవంతుని దగ్గరకు దూతలుగా పంపించే పక్షులు ప్రాకృతమైన పక్షులు కావని, అవి ఆచార్యులకు సంకేతాలని ఆచార్య హృదయం అనే గ్రంథంలో నాయనార్ అనే ఆచార్యులు తెలియజేశారు. అందువల్ల, ఇక్కడ, ఈ దశకంలో దూతగా నిర్దేశింపబడిన చిలుక కూడా ఆచార్యుడే.

భగవద్భక్తిని నిండుగా కలిగిన సదాచార్యుడు భగవానుడు నెలకొని ఉండే దివ్యక్షేత్రాలను సందర్శించినప్పుడు, వాటిని ప్రాకృతమైన ప్రదేశాలుగా భావించడు. భగవత్సంబంధాన్ని కలిగిన, భగవంతుని అభిమానాన్ని నోచుకున్న ఆ క్షేత్రాలను, అక్కడ ఉండే చరాచరాలను అప్రాకృతమైనవిగానే దర్శించి, పరమ భోగ్యాలుగా భావిస్తాడు. ఇక్కడ చిలుక కూడా ఒక సదాచార్యుడే కనుక, ఆళ్వారులు "ఒరు వణ్ణమ్ శెన్ఱు పుక్కు" అని అంటూ చిలుకతో పలకడం సాభిప్రాయకం, సాంప్రదాయిక రహస్యార్థద్యోతకం. ఇక్కడ ఆళ్వారుల సూక్తిలోని "కడందు" అనే ప్రయోగం విలక్షణమైనది, ముఖ్యమైనది. "కడందు" అంటే, "దాటి" అని అర్థం. "దాటిపోవడం" అంటే, "గమనించకుండా పోవడం" కదా. ఇక్కడ ఏమి గమనించకుండా? అంటే, ఆ దివ్యదేశంలోని భోగ్యతను గమనించకుండా, ప్రయత్న పూర్వకంగా, అతి కష్టంపై ఆ భోగ్యతను గమనించకుండా – అనేదే తాత్పర్యం.

భగవంతునిపై భక్తిని కలిగినవారికి, ఆ స్వామి నివసించే ప్రదేశాలు భోగ్యాలుగా ఉంటాయి అని, వాటిలో ఉండే భోగ్యతను అతిక్రమించి ముందుకు సాగడం చాలా కష్టమైన కార్యం – అనే విషయాన్ని వివరిస్తూ, ఇక్కడ నంబిళ్ళై శ్రీరామాయణంనుండి "స తదంతః పురద్వారం సమతీత్య" అనే ఒక ప్రమాణాన్ని ఉదాహరించారు. ఈ ప్రమాణం అయోధ్యాకాండలో 16వ సర్గలో ఉన్నది.

దశరథుడు, పట్టాభిషేకానికి శ్రీరాముని పిలుచుకొని రమ్మని తన మంత్రి అయిన సుమంత్రుని పంపించాడు. సుమంతుడు రామచంద్రుడు

నివసించే అంతఃపురంలోనికి వెళ్లి సందర్భాన్ని వాల్మీకి మహర్షి వర్ణిస్తూ, శ్రీరాముని పై అంతులేని భక్తిని కలిగిన ఆ సుమంతుడు శ్రీరాముడు నివసించే అంత పురాన్ని దర్శించినప్పుడు అతని మానసిక స్థితిని తెలియజేస్తూ, పై మాటను పలికాడు.

ఆ సందర్భంలో వాల్మీకి మహర్షి, 15 వ వసర్గలో సాభిప్రాయకంగా “తతో దదర్శ శిఖరం కైలాస శిఖర ప్రభమ్” అని ఆరంభించి, వరుసగా ఏడు శ్లోకాలలో శ్రీరాముని నివాస భవనాన్ని చాలా హృద్యంగా వర్ణించాడు. ఆ తరువాత, అచటి అంతఃపురాన్ని 17 శ్లోకాలలో వర్ణించి, ఆ సర్గను పూర్తి చేసి, 16వ సర్గను ఆరంభిస్తూ,

**“స తదంతః పురద్వారం సమతీత్య జనాకులమ్,**
**ప్రవివిక్తాం తతః కక్ష్యా మాససాద పురాణవిత్”**

(పురాణాలను చక్కగా తెలిసిన ఆ సుమంత్రుడు జనులతో నిండిన ఆ అంతఃపురద్వారాన్ని జాగరూకతతో దాటి, నిర్జనమైన లోపలి కక్ష్యను చేరాడు) అని అన్నాడు.

ఇక్కడ, ఈ శ్లోకంలోని “సమతీత్య” అనే ప్రయోగంలోని అర్థస్వారస్యాన్ని దృష్టిలో పెట్టుకొని, నంబిళ్ళై, దీనిని ప్రకృతంలో ప్రమాణంగా ఉదాహరించారు. “సమతీత్య” అంటే, “సమ్యక్ అతీత్య” – బాగా దాటి, అంటే, జాగ్రత్తగా దాటి –అని అర్థం. ఇక్కడ జాగ్రత్తగా దాటడం అంటే, అంతఃపుర ద్వారంలో ఉండే భోగ్యతను చూచి ఆకర్షితుడై, తతన కర్తవ్యాన్ని మరువకుండా, చాలా ప్రయత్నంతో తన చూపును మనస్సును నియంత్రించుకుని, అంతఃపురద్వారాన్ని దాటి – అని అర్థం.

ఈ విధంగా సుమంత్రుడు తన దృష్టిని, మనసును, నియంత్రించుకోవలసిన ఆవశ్యకత ఏమి? అంటే, శ్రీరాముడు నివసించే ఆ భవనం, దాని పరిసరాలు సుమంత్రునకు పరమ భోగ్యాలుగా తోచడమే. ఆ

భవనం, తాను ప్రాణ సమానంగా భావించే శ్రీరాముడు నివసించే భవనమై, పరిసరాలై ఉండడమే. వాటిలోని భోగ్యతను సుమంతుడు గమనించకుండా, మనసును నియంత్రించుకొని, చూపును నిలుపుకొని, సుమంత్రుడు లోపలికి ప్రవేశించాడు – అని ఇక్కడ తాత్పర్యం. ఆళ్వార్ల సూక్తిలోని "కడందు" ఈ పదం వల్ల తోచే అర్థమే ఇక్కడ "సమతీత్య" అనే పదం ద్వారా తెలియజేయబడింది.

"సమతీత్య" అనే ఈ పదాన్ని గోవిందరాజాచార్యులవారు కూడా "ద్వారస్య అతిభోగ్యతయా క్లేశేన విశ్లేషో వ్యజ్యతే" (ద్వారం చాలా భోగ్యమైనది కనుక, దానిని దాటి వెళ్లడం చాలా కష్టమైనది –అని వ్యక్తమౌతున్నది) అనే వివరించారు.

అయితే ఇక్కడ, అళ్వారుల సూక్తి లోని చిలుక ఆచార్యుడు కనుక, భగవద్భక్తిని కలిగిన ఆచార్యులకు భగవంతుని ఆలయ పరిసరాలు భోగంగా ఉండడంలో ఆశ్చర్యం లేదు. కాని, సుమంతుడు, ఈ చిలుకవలె, ఆచార్యుడు కాదు కదా. ఈ శ్రీరామాయణ సూక్తిని ఇక్కడ ప్రమాణంగా ప్రస్తావించడం ఏ విధంగా కుదురుతుంది? అనే సందేహం కలుగవచ్చు. అయితే, సుమంతుడు, శ్రీరాముని విషయంలో అంతు లేని ప్రీతిని కలిగినవాడు – అని శ్రీరామాయణం మనకు తరువాత జరిగిన సందర్భాలలో తెలుపుతున్నది. "శ్రీరాముడు తనను వదిలి వనవాసానికి వెళ్ళిన తరువాత, మళ్లీ అతడు తిరిగి వస్తాడో ఏమో! తనను పిలుస్తాడో ఏమో! అనే ఆశతో తాను ఎదురు చూశాను" అని దశరథునకు తెలియజేస్తూ, 59వ సర్గలో, చివర, సుమంతుడు–

**"గుహేన సార్ధం తత్రైవ స్థితోస్మి దివసాన్ బహూన్,**
**ఆశయా యది వా రామః పునః శబ్దాపయేదితి"**

(ఒకవేళ రాముడు తిరిగి వచ్చి, మళ్లీ నన్ను పిలుస్తాడో! ఏమో! అని గుహునితో పాటుగా నేను అక్కడ చాలా దినాలు ఎదురుచూచాను) అని

అన్నాడు. ఈ మాట సుమంత్రునకు రాముని విషయంలో ఉండే ప్రీతి ఎంతటిదో తెలుపుతున్నది. ఇక్కడ విశేషం ఏమంటే, సుమంతుడు ఎదురుచూసినది ఒకే దినం. ఐనప్పటికీ తాను ఎదురుచూచిన ఆ అల్ప కాలం పలు దినాలుగా తోచింది. దీనికి కారణం రామునిపై అతనికి కల ఆదరాభిమానాలే కదా. అందువల్ల సుమంతునకు రాముని భవనద్వారం పరమ భోగ్యంగా దర్శనమివ్వడంలో ఆశ్చర్యం ఏమీ లేదుకదా.

తిరువాయ్ మొళి ప్రబంధంలోను, శ్రీరామాయణంలోనూ గోచరించే సందర్భాలలోను, పదప్రయోగంలోను ఉండేసామ్యన్ని పురస్కరించుకొని, నంబిళ్ళై శ్రీరామాయణ సూక్తిని ఇక్కడ ఉదాహరించారు – అని తెలియాలి. ఈ రెండు దివ్యగ్రంథాల సూక్తుల మధ్య ఉండే ఇంతటి సూక్ష్మమైన అర్థసామ్యాన్ని గమనించి, దానిని తమ వ్యాఖ్యానం ద్వారా వ్యక్తం చేసిన నంబిళ్ళైకు కల అతిసూక్ష్మమైన పరిశీలనా ప్రతిభ అసాధారణమైనది, అనన్య గోచరమైనదికదా. వారికి వారి ఆ ప్రతిభకు దాసోహాలను సమర్పించి, ధన్యులం అవుదాం.

★★★★★★

# కాలం వెనక్కు వెళ్ళింది

★★★

ఈ బ్రహ్మాండంలో కాలతత్వం అనేది ముందుకు వెళ్లే గతిని కలిగినది. ఇది ఆ తత్వానికి కల సహజ ధర్మం. మనకు తెలిసి ఏ సమయంలోనూ కాలం వెనక్కు వెళ్లిన సందర్భాలు తెలియవు. "కాలం ఎల్లప్పుడూ ముందుకు వెళ్లే గతిని కలిగి ఉండాలి" అనే ఒక నియమాన్ని భగవానుడే ఏర్పరచాడు. ఏ బ్రహ్మాండంలోని ఉండే ఏ వ్యవస్థ అయినా, అది భగవానుడు చేసిన కట్టడియే కదా.

కానీ, భగవానుడు ఆవశ్యకమైతే, తన భక్తుల కోరికను తీర్చడం కోసం తానుఏర్పరిచిన వ్యవస్థను కూడా కాదని, దానిని మార్చే స్వభావాన్ని కలిగినవాడు. భక్తుని కోరికను తీర్చడం కోసం తన మాటను, తాను ఏర్పరిచిన వ్యవస్థను కూడా అతిక్రమించి వర్తించే భక్త వాత్సల్యాన్ని, సౌలభ్యాన్ని కలవాడు, అతడు.

దీనికి ఉదాహరణం ఏమంటే, "నేను ఆయుధాన్ని పట్టను" అని చేసిన ప్రతిజ్ఞను, శ్రీకృష్ణ భగవానుడు, "నేను ఏ విధంగానైనా సరే కృష్ణుని చేత ఆయుధం పట్టేటట్లు చేస్తాను" అనే పరమ భక్తుడైన భీష్ముడు పలికిన మాటను నిజం చేయడం కోసం, చక్రాయుధాన్ని పట్టిన సందర్భం భారత యుద్ధంలో మనకు కనిపిస్తుంది.

ఈ విధంగానే, "కాలం ముందుకు వెళ్లే తత్వం" అని తాను ఏర్పరిచిన నియమాన్ని కూడా కాదని, ఆ కాలాన్ని, పరమ భక్తులైన నమ్మాళ్వార్లను అనుగ్రహించడం కోసం, వెనుకకు వెళ్లేటట్లు చేసిన సందర్భం ఒకటి తిరువాయ్ మొళి దివ్య ప్రబంధంలో గోచరిస్తుంది.

ఈ సందర్భం, ఆ ప్రబంధంలోని నాలుగవ శతకం మూడవ దశకంలో దర్శనమిస్తుంది. ఈ నేపథ్యాన్ని కొంచెం గమనిద్దాం.

నాలుగవ శతకం "పాలనాయ్" అనే రెండవ దశకంలో అళ్వార్లు అనుగ్రహించిన పాశురాలు అన్నీ చాలా విలక్షణమైనవి. ఈ దశకంలోని పాశురాలను పరాంకుశ నాయకి తల్లి పలికే పాశురాలుగా దర్శనమిస్తాయి. ఈ పాశురాలు అన్నిటిలోనూ, పరాంకుశనాయకి భగవానుడు వేరు వేరు సందర్భాలలో అలంకరించుకున్న తులసిని తాను పొందాలని ఆశపడుతున్నట్లుగా తల్లి పలుకుతున్నది. తులసితో కూడిన వనమాలికను భగవానుడు ఎల్లప్పుడూ అలంకరించుకుంటాడు కదా.

మొదటి పాశురంలో, భగవానుడు, వటపత్ర శాయి దశలో చరణాలకు అలంకరించుకున్న తులసిని, రెండవ పాశురంలో రేపల్లెలోగోపికలతో పాటు రాసక్రీడ ఆడినప్పుడు పాదాలకు ఆభరణంగా అలంకరించుకున్న తులసిని, మూడవ పాశువర్లలో సనకసనందనాదులు తాము భగవదారాధన చేసే సమయంలో భగవానుని చరణాలకు అలంకరించిన తులసిని, నాలుగవ పాశురంలో పరమపదంలో ఆ స్వామి తన పాదాలకు అలంకరించుకున్న తులసిని, ఐదవ పాశురంలో శ్రీ కృష్ణావతార సమయంలో కుంభనృత్యాన్ని చేసినప్పుడు స్వామి తన పాదాలకు అలంకరించుకున్న తులసిని, ఆరవ పాశురంలో వరాహామూర్తి భూదేవిని ఉద్ధరించినపుడు ఆ స్వామి పాదాలకు అలంరించుకున్న తులసిని, ఏడవ పాశురంలో పాల సముద్రాన్ని చిలికినప్పుడు, అందులో ఉద్భవించిన శ్రీదేవిని భగవానుడు తన వక్షస్సుపై పెట్టుకున్నపుడు అతడు తన పాదాలకు అలంకరించుకున్న తులసిని, ఎనిమిదవ పాశురంలజ సీతాదేవి కోసం లంకనం దగ్ధం చేసిన శ్రీరామచంద్రుడు తన పాదాలకు అలంకరించుకున్న తులసిని– ఈ విధంగా వేరు వేరు సందర్భాలలో భగవానుడు తన పాదాలతో అలంకరించుకున్న తులసిని ప్రసాదంగా పొందాలని పరాంకుశ నాయకి ఆశపడుతున్నదని ఆమె తల్లి చెప్పినది. ఈ దశకంలో చివర ఉండే మిగిలిన

రెండు పాశురాలలో కూడా భగవానుడు అలంకరించుకున్న తులసిని నాయకి ప్రసాదంగా పొందాలని ఆశపడుతున్నట్లుగా తల్లి చెబుతున్నది. ఈ దశకంలోని చివరి పాశురంలో కూడా, తన కుమార్తె ఆశపడినట్లుగా భగవదనుగ్రహాన్ని పొందలేనందు వల్ల ఆమె చాలా ఆర్తిని పొందిందని తల్లి పలుకుతున్నది. ఇటువంటి చాలా ఆర్తిని పొందిన దశలో ఉండే ఆళ్వార్లు తర్వాతి దశకంలో తమ ఆర్తిని తెలియజేస్తూ ఉండే పాశురాలను పాడి ఉండాలికదా.

కానీ, తరువాత గల "కోవైవాయాళ్"అనే దశకంలో ఉండే దశకాలు పాశురాలు ఆళ్వార్లు ఎంతో తృప్తితో పలికే పాశురాలుగా కనిపిస్తున్నాయి. ఇది ఏ విధంగా సంగతం అవుతున్నది? అనే సందేహం కలుగుతుంది కనుక, దీనికి తగిన సమాధానాన్ని తిరుమల నంబి అనే ఆచార్యులు, ఎంబార్ అనే ఆచార్యులు, పరాశర భట్టర్ అనే ఆచార్యులు, ముగ్గురు మూడు విధాలయిన వివరణలతో తెలిపారు. ఈ మూడిటిలో ప్రస్తుతం ప్రసావించదగిన వివరణ భట్టర్ అనుగ్రహించిన వివరణ కనుక అది ఇక్కడ ప్రస్తావింపబడుతున్నది. ఇది మిగిలిన రెండు వివరణల కంటే పరమరస్యంగా ఉండడం కూడా గమనించదగినది.

ఈ సమాధానాన్ని భట్టర్ ఆళ్వార్ల సూక్తిని పురస్కరించుకునే నిర్వహించారు. ఏఈ దశకంలోని ఐదవ పాశురంలో ఆళ్వార్లు భగవంతుని ఉద్దేశించి "కాలశక్కరత్తాయ్!" అనే ఒక సంబోధనను చేశారు. సంబోధనలోని అర్థం ఏమంటే, "కాలచక్రాన్ని అధీనంలో కలిగినవాడా!" అని అర్థం. కాలమనేది చక్రస్వభావాన్ని,అనగా పరిభ్రమించే స్వభావాన్ని కలిగినది. ఒక దినం తరువాత వేరొక దినం, ఒక పక్షం తరువాత వేరొక పక్షం, ఒక మాసం తరువాత వేరొక మాసం, ఒక అయనం తరువాత వేరొక అయనం, ఒక సంవత్సరం తరువాత వేరొక సంవత్సరం, ఒక యుగం తర్వాత వేరొక యుగం, ఒక కల్పం తరువాత వేరొక కల్పం అని ఈ విధంగా మాటిమాటికి పరిభ్రమించే స్వభావాన్ని

కలిగినది కనుక, కాలం చక్రస్వరూపంగా నిర్దేశింపబడుతున్నది. అటువంటి కాలతత్వాన్ని నిర్వహించేవాడు భగవానుడే కదా.

ఈ కాలచక్రం సుదర్శనాత్మకమైనది. వేదాంతదేశికులు శ్రీసుదర్శన భగవానుని వైభవాన్ని తెలియజేసే షోడశాయుధ స్తోత్రంలోని మొట్టమొదటి శ్లోకంలో "కాలచక్రం చ శాశ్వతమ్" అని కాలస్వరూపునిగా సుదర్శనుని స్తోత్రం చేశారు. అందువల్ల, భగవానుడు తన చేతిలో సుదర్శన చక్రాన్ని ధరించడం ద్వారా, "నేను నా అధీనంలో కాలతత్వాన్ని కలిగినవాడను" అనే తత్వాన్ని వ్యక్తం చేస్తున్నాడు. అందుచేత ఇక్కడ ఆళ్వారుల చేసిన "కాలశక్కరత్తాయ్" అనే సంబోధనకు "చక్రరూపంలో ఉండే కాలాన్ని అధీనంలో కలిగినవాడా!" అని తాత్పర్యం.

అయితే ఆళ్వార్లు ప్రస్తుతంలో ఈ సంబోధనను ఎందుకు చేశారు? అనే విషయాన్ని కొంచెం లోతుగా గమనించాలి. ఈ సంబోధనయే ప్రస్తుతంలో కలిగే సందేహానికి సమాధానం చెబుతున్నది అని భట్టర్ అభిప్రాయం.

పరాంకుశ నాయకి గత దశకంలో తాను పొందాలని ఆశపడిన తులసి ప్రస్తుతంలో లభించే అవకాశం లేదు ఎందుకంటే ఆమె కోరిన తులసి సృష్టి ప్రారంభం అవ్వడానికి ముందుగా ప్రయాణంలో ప్రళయ సముద్రంలో మర్రి ఆకు పడుకపోయిన శయనించి ఉండే వటపత్ర శాయి స్వామి తన పాదాలకు అలంకరించుకున్న తులసిని, అదేవిధంగా, ఎప్పుడో జరిగిన వామనరామ కృష్ణాది అవతారాలలో భగవానుడు తన చరణాలకు అలంకరించుకున్న తులసిరి పొందాలని ఈమె ఆశపడుతున్నాయి. కాలతత్త్వం ముందుకు సాగే ఈ బ్రహ్మాండంలో అది ఏ విధంగా సాధ్యం అవుతుంది? సాధ్యం కానందు వల్ల నాయకి మనసులోని ఆర్తి అతిశయించింది.

అళ్వార్ నాయకి మనస్సులో ఉండే ఈ ఆర్తిని భగవానుడు తీర్చాలని సంకల్పించాడు. కానీ, కాలం అనేది ముందుకే వెళ్లే స్వభావాన్ని కలిగినది అనే నియమాన్ని కొనసాగించినట్లయితే కోరిక తీరే అవకాశం లేదు. అందువల్ల, తాను సామాన్యంగా విధించిన "కాలం ముందుకు వెళ్లే స్వభావాన్ని కలిగిన తత్వం" అనే నియమాన్ని తాత్కాలికంగా మార్చాడు. ఎప్పుడో ఆయా సమయాలలో తాను తన పాదాలకు అలంకరించుకున్న తులసిని ఆళ్వార్లు అనుభవించేటట్లు చేశాడు. ఆళ్వార్లకు తృప్తి కలిగింది. ఆ తృప్తితో అనంతర దశకంలో ఉండే పాశురాలను అనుగ్రహించారు.

ఆ విధంగా తరువాతి దశకంలో పాశురాలను అనుగ్రహించేటప్పుడు అళ్వార్లు తమ ఆశ తీరేటట్లుగా భగవానుడు చేసిన ఉపాయాన్ని సూచిస్తూ "కాలశక్కరత్తాన్!" అనే సాభిప్రాయకమైన విశేషణ ప్రయోగాన్ని చేశారు– అనే భట్టర్ అభిప్రాయపడి, తదనుగుణమైన వివరణను ఇక్కడ అనుగ్రహించారు.

భగవానుడు ఏవిధంగా ఆళ్వారుల కోరికను తీర్చాడు అంటే, పురోగమనాన్ని స్వభావంగా కలిగిన సుదర్శనాన్ని ఒక క్షణకాలం స్వామి తిరోగమన స్వభావాన్ని కలిగినదానినిగా చేశాడు. చక్రం వెనుకకు తిరిగేటట్లు చేశాడు. దాని పర్యవసానంగా ఎప్పుడో జరిగిన సంఘటనలను వస్తువులను సాక్షాత్తుగా దర్శించడానికి అవకాశం ఆళ్వారులకు ఏర్పడింది. ఆ అనుభవం వల్ల వారికి సంతృప్తి కలిగింది.

ఈ సందర్భంలో ఈడు వ్యాఖ్యాన సూక్తి, దానిని వివరించే అరుంబద వివరణం ఈ విషయాన్ని సూచిస్తున్నది. ఆళ్వారులు చేసిన "కాల శక్కరత్తాన్" అనే ప్రయోగానికి భట్టర్ చేసిన వివరణను వ్యాఖ్యాత నంబిళ్ళై వివరిస్తూ "కాలశక్కరత్తానాకైయాలే కాలోపాధియై క్కழித్తు, వర్తమాన కాలత్తిల్ నపోలే అనుభవయోగ్యమామ్బడి కాలత్తై ఒరుపోకి యాక్కి కొడుక్క అనుభవిక్కిఱార్– ఎన్ఱు అరుళిచ్చెయ్ వర్" (భగవానుడు, కాలతత్వాన్ని నిర్వహించే సుదర్శన చక్రాన్ని తన స్వాధీనంలో కలిగినవాడు కనుక,

కాలోపాధిని తొలగించి, వర్తమాన కాలంలోవలె గతంలో ఉండే వస్తువులను కూడా అనుభవానికి సాధ్యమయ్యేటట్లుగా ఉండేటట్లు కాలస్వభావాన్ని మార్చి, అనుభవింపజేయగా అనుభవిస్తున్నారు – అని భట్టర్ అన్నారు) అని అన్నారు.

ఈ వివరణలోని తాత్పర్యం ఏమంటే, ఈ లోకంలో ఉండే అనుభవం అనేది కాలాన్ని ఉపాధిగా కలిగినది. అంటే ఏ వస్తువు యొక్క అనుభవం అయినా, ఆ వస్తువు ఉన్న కాలంలో, జీవించినవారికే వస్తువు అనుభవం కలిగే అవకాశం ఉన్నది. ఆ వస్తువు యొక్క అస్తిత్వం, అంటే,సత్తా లేకుండా పోయిన తరువాత దాని అనుభవాన్ని పొందడానికి ఎవరికీ సాధ్యం కాదు అందువల్ల ఒక వస్తువు యొక్క అనుభవం అనేది కాలం పై ఆధారపడి ఉన్నది. కాలాన్ని ఉపాధిగా కలిగి ఉన్నది. ఇది భగవంతుడు ఏర్పడిన ఒక కాలవ్యవస్థ. ఈ కాలవ్యవస్థను మార్చదలచిన భగవానుడు, ఈ వ్యవస్థకు నియామకుడైన సుదర్శనుని గమనాన్ని వేరు విధంగా ఉండేటట్లు తాత్కాలికంగా నియమించాడు. అంటే తాత్కాలికంగా వెనుకకు తిరిగేటట్లు చేశాడు. అప్పుడు, అళ్వార్లకు, ఎప్పుడో ఈ విభూతిలో ఉన్నది, ప్రస్తుతం లేనందున, అనుభవ దూరమై ఉండేది అయిన తులసియొక్క అనుభవం ఆళ్వార్లకు కలిగే అవకాశం కలిగింది.

★★★★★